31-7-1992 శుక్రవారం 12 పేజీలు సంపుటి : 63 సంచిక :31 విడిప్రతి : రు. 2.00 లు

Regd. No. H.N.L. 18

# జమీన్ రైతు



స్థాపకుడు : నెల్లూరు వెంకటరామానాయుడు

## కల్లోలం సృష్టిస్తున్న కొత్త కాలేజీలు

మెడికల్ కాలేజీల మంజూరు, అనకాపల్లి అసమ్మతి సభ, పిసిసి అధ్యక్షుడిపై దాడి తదితర సంఘటనలు ఈ వారంలో రాష్ట్ర రాజకీయాన్ని వేడెక్కించాయి.

మెడికల్ కాలేజీల అనుమతి ఇటు

### అసమ్మతి సభ అభాసుపాలు

అసమ్మతికి, అటు ప్రతి పక్షానికి కూడా మంచి విమర్శనాస్త్రమే. ముఖ్యమంత్రి పైన వ్యక్తిగతంగా దాడిచేయడానికి దీన్ని వారు బాగా వాడుకొనేట్లున్నారు. కాలేజీల అనుమతిలో కేవలం కాంగ్రెస్ వారులను, అందులోనూ స్వపక్షీయులను మాత్రం సంతృప్తి పరచడం జరిగింది. దరఖాస్తులు మాత్రం అన్ని వర్గాల నుంచీ వచ్చాయి. ప్రతిపక్షాలకు సంబంధించిన సంస్థలు సైతం అప్లికేషన్ పెట్టాయి. అసమ్మతీయుల తరఫునా ప్రయత్నం చేశారు. కాని పరిశీలనలో వారందరూ ఎగిరి పోయారు. ఇందుకోసం ఏర్పాటైన కమిటీ ఎంపిక చేసిన కాలేజీలనే ప్రభుత్వం మంజూరు చేసిందని, ఇందులో తమ ప్రమేయం ఏమీ లేదని జనార్ధనరెడ్డిగారు ప్రకటించినా, ముఖ్యమంత్రి ఇష్టాఇష్టాల ప్రకారమే విద్యా సంస్థలు పని చేయడం లేదు. ధర్నాలు, ఘెరావ్‌లు జోరుగా సాగుతున్నాయి. అసమ్మతీయులు ఆరోపణల పత్రం తీసుకొని ఢిల్లీ వెళ్లబోతున్నారు. సిపిఐ, తెలుగుదేశం పార్టీలు ఇప్పటికే ఆందోళనా కార్యక్రమం

### తులసిదాస్‌పై దాడి రభస

ప్రకటించాయి. రాజ్యసభలోనూ ఈ విషయం ప్రస్తావనకు వచ్చింది. ఎన్టీరామారావు గారు సింహగర్జన చేస్తున్నారు.

జనార్ధన రెడ్డి ముఖ్యమంత్రి అయిన తర్వాత ప్రభుత్వ నిర్ణయాలపై పలుకుబడి కల్గిన వారిని సంతృప్తి పరచడమే దీనికి కారణం. తెలుగుదేశం వీలికకు కారకుడై, పివి ప్రసన్నత సంపాదించిన శ్రీ భూపతి రాజా విజయకుమార రాజుకు ఒక కాలేజి మంజూరు చేశారు. దీని విషయమై ముఖ్యమంత్రికి సాక్షాత్తు ప్రధాని నుంచే సిఫార్సు అందిందని వినికిడి. తెలుగుదేశం నుంచి చీలి వచ్చినందుకు పారితోషికంగా శ్రీ రాజా ఈ కాలేజిని పొందారని తెలుస్తున్నది. శ్రీ మాగుంట సుబ్బరామరెడ్డికి ఒంగోలులో మంజూరు

### ఉపరాష్ట్రపతి నారాయణన్

భారత ఉపరాష్ట్రపతిగా శ్రీ కె.ఆర్. నారాయణన్ నిర్పోటీగా ఎంపిక కాబోతున్నారు. ఆయన ఈ రోజు (31 తేది) కాంగ్రెస్ అభ్యర్థిగా నామినేషన్ పత్రాలు దాఖలు చేస్తున్నారు. బిజెపి, సిపిఎంలతో సహా అన్ని ప్రతిపక్ష పార్టీలు మద్దతునిస్తున్నాయి. అందువల్ల పోటీ లేదు. 1 తేది స్క్రూటిని తర్వాత ఆయన ఏకగ్రీవ ఎన్నిక ప్రకటన వెలువడుతుంది.

నారాయణన్ వారి జనుడు; మాజీ రాయబారి; ప్రస్తుతం కాంగ్రెస్ లోక సభ సభ్యుడు.

లక్ష్యపెట్టడం లేదు. ఖమ్మం జిల్లాలో ఒక బడా సారాయి కాంట్రాక్టరుకు కమ్యూనిస్టు నాయకుల సిఫార్సు పైన ఒక కాలేజీ ఇచ్చారట. అందువల్లే వారు ఆందోళనలో పాలుపంచుకోవడానికి సంకోచిస్తున్నారు

**రాజధాని రాజకీయం**



## ముఖ్యమంత్రి నిబ్బరం

అనుమతి మంజూరైందనేది అందరి ఆరోపణ. అందువల్లే అన్ని వర్గాలూ అట్లా విరుచుక పడుతున్నాయి. విద్యార్థి సంఘాలు కూడా ఈ అంశంపై రాష్ట్ర వ్యాప్త ఆందోళనకు దిగాయి. అన్ని రాజకీయ పార్టీల సంఘాలూ అందులో పాల్గొంటున్నాయి. రాష్ట్రంలోని పలు ప్రధాన పట్టణాలలో 3 రోజుల నుంచి రాష్ట్ర వ్యాప్తంగా అలజడి తలెత్తడం ఇదే ప్రథమం. ఇప్పటి వరకు ఆయన తన ప్రభుత్వ విధానాలు, నిర్ణయాలు వివాదాస్పదం కాకుండా కాపాడు కుంటూ వస్తుండినారు; ఈ ఆందోళన పట్ల కూడ ముఖ్యమంత్రి పెద్దగా ఆందోళన చెందినట్లు కన్పడడం లేదు. కాలేజీల మంజూరులో, ఢిల్లీ పెద్దల దగ్గర చేసిన కాలేజి సైతం ఢిల్లీ పెద్దల అభీష్టానుసారం జరిగిందంటారు రంగారెడ్డి జిల్లాలోని తుర్కపల్లి కాలేజి, ప్రధాని పివికి అత్యంత సన్నిహితుడైన ఒక పారిశ్రామిక వేత్త దని చెప్తున్నారు. వీటన్నింటి వల్ల ఢిల్లీ వర్గాల నుంచి తనకు ఏ ఇబ్బందీ ఎదురు రాదని ముఖ్యమంత్రి ధీమాగా వున్నారు. ఇద్దరు కేంద్ర మంత్రుల అనుచరులు కూడా ఈ నిర్ణయంలో లబ్ధి పొందారు. అందులో కె. విజయభాస్కర రెడ్డి గారూలు వున్నారు. ప్రతిపక్షాల ఆందోళను ముఖ్యమంత్రి ఈ పరిస్థితులలో ముఖ్యమంత్రి ఎవర్ని చూసి భయపడాలి?

కాలేజీల ఏర్పాటుకు అనుసరించిన విధానాలు, నిపుణుల కమిటీ సూచనలు, విధించిన షరతులను ప్రజలకు వివరించి, తెలుగుదేశం చేసే ప్రచారాన్ని త్రిప్పి కొట్టాలని ముఖ్యమంత్రి ప్రయత్నిస్తున్నారు. మెడికల్ కాలేజీల స్థాపనకు చాలా విస్తృతమైన వసతులు కల్పన చేయవలసి వుంటుంది. పది, పన్నెండు కోట్ల రూపాయలకు తక్కువ

కొరవ 7 పేజిలో

## రంగడి గుడికి కన్నం—

## చోరికి ముందే దొంగలు చిక్కారు!

నెల్లూరు రంగనాయకుల స్వామి దేవస్థానంలో పెద్ద చోరీ యత్నం బయట [illegible] ఒక పథకం ప్రకారం గుడికి కన్నం వేయడానికి ప్రయత్నించిన చోరాగ్రేసరులను, దేవస్థానం వాచ్‌మెన్‌ల మెళకువతో చుట్టు ప్రక్కల ప్రజలే పట్టివేశారు. దేవుడి సొత్తు చోరగ్రస్తం కాకుండా కాపాడారు. మంగళ వారం రాత్రి జరిగింది సంఘటన.

రంగడి గుడికి పెద్దగా రక్షణ ఏర్పాట్లు వుండవు. రాత్రి పది దాటితే అక్కడ జన సంచారమే తక్కువ. పడమట వైపు, గుడికి వెనుక భాగాన పెన్నానది వుండడంతో, ఆ వైపు పగలు కూడా జనం తిరగరు. దేవాలయంలో మాత్రం విలువైన విగ్రహాలు, వెండి, బంగారు ఆభరణాలు వుంటాయి. ఈ పరిస్థితి కనిపెట్టి కర్నూలు జిల్లా ఆళ్లగడ్డకు చెందిన ఒక చోరాగ్రేసరుడు పథకం పన్నాడట. అతడికి, నెల్లూరులోని ఒక

**వాచ్‌మెన్‌ల మెళకువ దేవుడి సొత్తును కాపాడింది**

బంగారు అంగడిలో పనిచేసే ఇద్దరు యువకులు తోడై వచ్చారు. వీరందరూ కలిసి ముందుగా దేవాలయ భవనాల స్వరూప స్వభావాలను క్షుణ్ణంగా అధ్యయనం చేశారట. మామూలు భక్తుల మాదిరి దేవాలయానికి వచ్చి ప్రత్యంగుళం పరిశీలించిన ట్లున్నారు వారి దృష్టి పడమటి వైపున వున్న తాయారు సన్నిధి గుడిపై పడింది. అందులోని అమ్మవారి విగ్రహమే రెండులక్షల విలువ చేస్తుందట. పంచలోహాలతో నిర్మించిన పురాతన విగ్రహమది. దానిలో మూడు లక్షల విలువైన ఆభరణాలూ వున్నాయి.

పైన్నవైపు నుంచి అమ్మ్మ దేవాలయం గర్భగుడికి తాళ్లు వేసి,పైకి ఎక్కేవారట. లోపలకు ప్రవేశించడానికి వారు ఒక అనువైన స్థలం కనిపెట్టారు. రోజూ రాత్రి పూట అక్కడకు రావడం, గర్భగుడి పై కప్పు రాళ్లను కొద్ది కొద్దిగా కదిలించడం చేస్తుండినారు. ఈ గుడి, ప్రధాన దేవాలయానికి వెనుక ఎటువంటి జన సంచారమూ లేని ప్రదేశంలో వుండడంతో వారం రోజుల నుంచి వారు రాళ్లు పగల గొట్టినా ఎవరి దృష్టికీ రాలేదు.



నెల్లూరు రంగనాయకుల స్వామి దేవస్థానంలో గర్భగుడిపైన దొంగలు వేసిన కన్నం దృశ్యం; (గుండ్రటి మార్కు మధ్యనున్నది )

కొరవ 7 పేజిలో

## జమీన్‌రైతు
# మెడికల్ కాలేజీలు

ఒక్కసారిగా ఇరవై ప్రైవేటు వైద్య కళాశాలలను మంజూరు చేసి చరిత్ర సృష్టించింది రాష్ట్ర ప్రభుత్వం. పన్నెండు మెడికల్ కాలేజీలు 8 దంత కళాశాలలు ఈ ఏడాది నుంచి పని చేయడం ప్రారంభిస్తాయి. రెండు మూడు రోజులలో కొత్త ఇంజనీరింగ్ కాలేజీలపై కూడా నిర్ణయం జరగవచ్చు. వాటి సంఖ్య పదికి పైనే వుంటుందని అంచనా.

ప్రైవేటు వైద్య కళాశాలలను అనుమతించే ప్రతిపాదన వుందన్న సంగతి అందరికీ తెలిసిందే కాని, ఇంత భారీ సంఖ్యలో అవి అనుమతింప బడడమే అందర్నీ ఆశ్చర్య పరచింది. కేవలం కాంగ్రెస్ వాదులకు, అందులోనూ సంపన్న వర్గాలకు చెందిన వారికి మాత్రమే కాలేజీల నివ్వడంతో విమర్శకూ ఆస్కారమేర్పడింది. ముఖ్యమంత్రితో సహా కాంగ్రెస్‌లోని పలుకుబడి కల్గిన వర్గాల వారందరూ కాలేజీలు సంపాదించారు. మెడికల్ కాలేజి స్థాపనకు కోట్ల రూపాయిల పెట్టుబడి ఎట్లా అవసరమో, వాటిపై వచ్చే ఆదాయమూ కోట్లలోనే వుంటుంది. భవనాలు, ఇతర ప్రాథమిక వసతులకు మొదటి రెండు, మూడేళ్ల డొనేషన్ల డబ్బు వ్యయమైనా – ఆ తర్వాత ఒక్కొక్క యాజమాన్యం ఏటా మూడు, నాలుగు కోట్ల ఆదాయం అనాయసంగా పొందుతుంది.

ప్రైవేటు రంగంలో మెడికల్ కాలేజీలు ఏర్పాటు చేయడం దురదృష్టకరమైన, గత్యంతరం లేని అవసరం. ప్రభుత్వం తనంత తానుగా కొత్త కాలేజీలు ఏర్పాటు చేసే స్థితిలో లేదు. పెరుగుతున్న జనాభాకు, అవసరాలకు ఇప్పుడున్న కాలేజీలు చాలడం లేదు. మెరిట్ సీట్లు చాలా పరిమిత సంఖ్యలో, అసాధారణ ప్రతిభ కల్గినవారికి తప్ప దొరకడంలేదు. అందువల్లే ఉన్నతవిద్యపై ఆసక్తి గలవారు కర్ణాటకకు ఎగబడుతున్నారు. ఈ సంవత్సరం బెంగుళూరులోని రామయ్య కాలేజీలో మెడికల్ సీటు రేటు 7 లక్షలట. ఈ లెక్కన ఎన్ని కోట్ల రూపాయల డబ్బు ఆ రాష్ట్రానికి తరలి పోతుందో అర్థం చేసుకోవచ్చు. డబ్బు ఖర్చే కాకుండా, పిల్లలను దూరప్రాంతాలకు పంపవలసిన పరిస్థితి తల్లిదండ్రులకు బాధాకరంగా వుంది. ఆ దృష్టితో చూసినపుడు స్వరాష్ట్రంలో మెడికల్ కాలేజీల సంఖ్య పెరగడం మంచిదనే భావించాలి.

అయితే కేవలం రాజకీయ, వ్యక్తిగత అంశాల పరిశీలనతో మాత్రమే కాలేజీలు మంజూరు కావడం వల్ల, ఆ యాజమాన్యాలు ఎట్లా వుండబోతాయో నన్న సందేహం కల్గుతున్నది. ప్రభుత్వం ఇచ్చిన అవకాశాన్ని ఉపయోగించుకొని, భవనాలు, ఆస్పత్రులు నిపుణులైన అధ్యాపకులు పరికరాలను సమకూర్చుకుంటే ఫర్వాలేదు. కాని, అది జరుగుతుందా అన్నదే అనుమానం. మెడికల్ కాలేజి సమర్థవంతంగా నిర్వహించాలంటే, కనీసం 750 పడకల ఆస్పత్రికావాలి! ఇప్పటి ధరల ప్రకారం చూస్తే అటువంటి ఆస్పత్రి పెట్టడానికి ఏ పది కోట్లో వ్యయమౌతుంది. ఆ ఆస్పత్రిని నడపడానికి యాజమాన్యానికి నిపుణత వుండాలి. పైగా, విద్యార్థులకు వివిధ రోగాల పై అవగాహన కల్పించడానికి రోగులు కావాలి! డబ్బు పెట్టినా లభ్యమయ్యే వసతులేనా ఇవి? అన్నిటికీ మించి, ఇన్ని కాలేజీలలో పాఠాలు చెప్పడానికి ప్రొఫెసర్లు, లెక్చరర్లు లభిస్తారా అన్నది ఇంకా పెద్ద సమస్య. యాజమాన్యాలు దండిన డబ్బును కనీసం ఐదారేళ్ల పాటైనా కాలేజీల అభివృద్ధికి ఖర్చుపెడితే, విద్యార్థులకు సౌకర్యంతో పాటు , అనుమతిచ్చిన ప్రభుత్వానికి పేరు నిలుస్తుంది. కాలేజీల అనుమతి లాభార్జనకు లైసెన్సుగా భావిస్తే మాత్రం, ఆ కాలేజీలు సంఘానికి ప్రమాదకారులుగా పరిణమిస్తాయి; అక్కడ చదివే డాక్టర్లు, కేవలం డిగ్రీలు పొందడం తప్ప, వైద్య పరిజ్ఞానం లేని వారుగా తయారై, ప్రజల పాలిట యమకింకరులయ్యే ప్రమాదమూ వుంది.

ఈ కొత్త కాలేజీల వల్ల జరిగిన ఒకే ఒక మేలు – మెరిట్ సీట్ల సంఖ్య పెరగడం. ప్రతిభ కలిగి, విపరీతమైన పోటీ వల్ల సీట్లు పొందలేని విద్యార్థులకు ఇవి ఎంతో ఉపశమనం కల్గిస్తాయి. వైద్య విద్యపై మోజు వుండి, సాధారణ ప్రతిభ కల్గిన వారికి దంత వైద్య కళాశాలలు కొండంత ఉపకారం చేస్తాయి.

డొనేషన్ల విధానం శాశ్వతం కాదని; క్రమానుగతంగా, కాలేజీలు అభివృద్ధి చెందే కొద్దీ వీటి శాతాన్ని తగ్గిస్తూ పోతామని ముఖ్యమంత్రి ప్రకటించారు. ఈ ప్రతిపాదన నిజంగా పరిశీలనలో వుందో, లేక దీనిపై తలెత్తిన వివాదాన్ని, అలజడిని తగ్గించడానికి వేసిన మంత్రమో తెలియదు. కాలేజీల అనుమతి కేవలం లాంఛన ప్రాయమని, ప్రారంభానికి ముందు ఆయా యాజమాన్యాలు పలు కఠినతరమైన నిబంధనలు పాటించవలసి వుంటుందని కూడా చెప్పారాయన. అయితే ఆ నిబంధనలను యాజమాన్యాలు పాటించ గల్గుతాయా, ప్రభుత్వమూ చివరి కొచ్చేసరికి అంత కఠినంగా వుండ గల్గుతుందా అన్నది సందేహం.

ఎన్ని ఆరోపణలు వచ్చినప్పటికీ, ఎంత అలజడి రేగినప్పటికీ ఈ కాలేజీల ఏర్పాటు ఆహ్వానించదగిన పరిణామమే!

## జమీన్‌రైతు

8 పేజీలు అణా

31-7-1942.

### పోస్టు ద్రవ్యాపహరణం

సైదాపురం పోస్టులో పంచాయితీ బోర్డు ద్రవ్యం రు.400 లు అపహరణం జరిగిందని పోస్టు మాస్టర్ను అరెస్టు చేశారని, ఆ పని ఒక టీచరుకు యిచ్చారని తెలుస్తున్నది.

### సుందరయ్య

పుచ్చలపల్లి సుందరయ్య 3 సంవత్సరాలుగా పోలీసులకు దొరకకుండా రహస్యంగా పనిజేస్తుంటి, వారి పార్టీ మీద నిషేధాన్ని తీసివేసిన తర్వాత నెల్లూరు వచ్చారు. 30 తేది సాయంత్రం సత్రం వద్ద యుద్ధధోరణిని గూర్చి ఉపన్యసించారు.

### కలెక్టరు

జిల్లాకలెక్టరు 'డే' గారు 5 తేది నుండి ఒక మాసం సెలవు. బదులు డాడ్వెల్ గారు వస్తున్నారు.

### కలరా

ఆత్మకూరు తాలూకాలో 12 గ్రామాల్లో కలరా వుంది. 171 మందికి తగిలి, 80 మంది చచ్చారు. ఇందులో తాడిపర్తిలో మాత్రం 88 మందికి తగిలి, 43 మంది చచ్చారు. ఇప్పుడు తాలూకాలో చాలా భాగం నెమ్మదించింది.

కనిగిరి తాలూకాలో కనిగిరిలో మాత్రముంది. 14 మందికి తగిలి 27 గురు చచ్చారు. 26 తేది నుండి కొత్త తాకుడు లేదు.

పొదిలి డివిజన్ 2 గ్రామాల్లో వుంది. 19 మందికి తగిలి 9 మంది చచ్చారు. కొత్త తాకుడు లేదు.

కోవూరు తాలూకాలో ఇస్కపాళెం, పల్లపల్లె, గండవరంలలో మాత్ర ముండినది. 11 మందికి తగిలి 5 గురు చచ్చారు. ఇక్కడా కొత్త తాకుడు లేదు.

జిల్లామొత్తం మీద 215 మందికి తగిలింది. 101 మంది చనిపోయినారు. అన్ని చోట్ల తగ్గిన సూచనలు కనపడుచున్నవి.

### 50 ఏళ్ళ క్రితం ఈ వారం

### పెళ్లూరు

వూళ్లో టెంకాయల ఖర్చు తగ్గిపోయింది. అలజడి వర్తకుల్లో, విచారిస్తే శివాలయం పాడుబడ్డది. ఆలయంలోకి వెళ్లిన భక్తులంతా టెంకాయల్తో యిల్లు జేర్తున్నారు. శివుడి నోట్లో మట్టిగొట్టి ఆదాయం పగిలిపోయిన లాంతర్ల రిపేరికి పెట్టమన్నారట పంచాయితీ బోర్డు వారు. ఈ విషయం తహశిల్దారు వారి కళ్లకు, మనస్సుకు, కలానికి తెలిసినదే. కాని టైంరాలేదు కాబోలు?

– బాటసారి

### ముత్తుకూరు

చివరకు యిన్‌స్పెక్టరు జోలికు పోజేసి గాని సర్టిఫికేటు (రికార్డుషీటు) ఆ విద్యార్థి చేతికి రాలేదటనే!

### కృష్ణాపట్నం

విద్యార్థుల చదువు మీదికి తమ దృష్టి మరలిస్తారు గదూ మాస్టారు గారూ!

–శిష్య

### రాపూరు

యుద్ధ ప్రచార సందర్భంలో జంగం వేషం వేసుకొని బుర్రకథ చెప్పినందుకు యం. ఖాదర్‌హుసేన్ గారికి గెలిటి గారు సర్టిఫికేటు యిచ్చారు.

ఈ వూరిలో ఒక ఉపాధ్యాయిని గారి భర్త 21 తేది బైటవెళ్లి వస్తుంటే ఈ వూరి అసిస్టెంటు మునసబు, కరణము గారలు ఆయన భార్యని తిట్టి, ఆయన్ను కొట్టారని పోలీసుకు రిపోర్టు, డి.యస్.పి.కి పిటీషన్ పోయింది.

– ఒ.వి.

### ఉదయగిరి

మాధ్యమిక పాఠశాలలో 90 మంది గలరు. ఈ పాఠశాల ఈ సంవత్సరమే ఎత్తి వేస్తారని తెలిసి కొందరు విద్యార్థులు రానట్లు తెలుస్తుంది. అట్టి వారి సౌకర్యార్థము ఆగస్టు 1 తేది తిరుగా మరియొక ప్రవేశ పరీక్ష జరుపబడును.

– ప్రధానోపాధ్యాయుడు

# డెబ్బయ్ ఏళ్ల తర్వాత మద్యపాన నిషేధోద్యమం !

ఇటీవల మనజిల్లాలోని గ్రామాల్లో కల్లు సారా షాపులపై జరుగుతున్న మహిళా దండయాత్రలు చూస్తుంటే స్త్రీఅబల కాదు అన్నది నిజమనిపిస్తుంది. ఎన్నెన్నో చట్టాలు, శాసనాలు వేసినా మద్యపాన నిషేధాన్ని యింతవరకు అమలు జరుప లేక పోయాం. చివరకు అక్షరాస్యత ఉద్యమం వల్ల నైతేనేమి, జన చైతన్య కేంద్రాల స్ఫూర్తి వల్లనైతే నేమి మద్యపానం ఇకమీదట తమ తమ ప్రాంతాల్లో సాగనివ్వ కూడదనే నిర్ణయానికి వచ్చింది మహిళా ప్రపంచం. ఈ ఉద్యమాన్ని విస్తరింప జేసి, ఇంకా ఉధృతం చేసి మిగతా గ్రామాలను కూడా ఈ ఉద్యమంతో ఉత్తేజితుల్ని చేసి సారా అమ్మకాలు కొన సాగనివ్వకుండా చెయ్యాలనే అకుంఠిత దీక్షతో పోరాడుతూంది. కొన్ని కొన్ని చోట్ల ఉద్యమ కార్యకర్తలకు లాఠీ దెబ్బల వంటి చేదు అనుభవాలు ఎదురు కావడం నిజంగా శోచనీయం. స్వంత ఆర్థిక స్థితిగతుల బాగోగుల మీద, కుటుంబంలో మద్యాన్ని సేవించే వారి ఆరోగ్యం మీద శ్రద్ధ తీసుకొని మహిళాలోకం మద్యపాన నిషేధానికి ముందడుగు వేస్తుంటే పోలీసులే కొన్ని కొన్నిచోట్ల సారా అమ్మకాలు సాగించడం, ఉద్యమాన్ని నిరుగార్చ యత్నించడం ఏవిధంగానూ సమర్థనీయంకాదు.

కల్లు అంగళ్ల వేలాలను బహిష్కరించడంలో యావద్భారతంలో మన నెల్లూరు జిల్లా 1921లోనే అగ్రస్థానం వహించింది. ఆంగ్ల ప్రభుత్వం నానారకాలుగా ఉద్యమకారులను ఇబ్బంది పెట్టి, వేలం పాటలు- కొనసాగించే ప్రయత్నాలు చేసినా, ఆనాటి కాంగ్రెసు నాయకులు వాటిని భగ్నం చేసి, ఉద్యమాన్ని తీవ్రతరం చేసి ప్రభుత్వం వారి ఆదాయం రెండు లక్షలనుండి రెండు

### జనవాణి

వందలకు పడిపోయేట్టు చేశారు. పై విషయాన్ని గాంధీగారు "యంగ్ ఇండియా" లో ప్రస్తావించి, నెల్లూరును ఎంత గానో ప్రశంసించారు. అమెరికా నుంచి పుస్సిఫుట్ జాన్సన్ల ప్రశంసలు సైతం మన నెల్లూరికి దక్కాయి.

యిప్పుడు మళ్లీ 70 ఏళ్ల తర్వాత అంతకు మించిన స్ఫూర్తితో, ద్విగుణీకృతమైన ఉత్తేజంతో ముందుకు ఉరకలేస్తూ సాగుతున్న మద్యపాన నిషేధ ఉద్యమానికి మహిళలే నడుంకట్టడం అభినందనీయం.

అలనాటి నాయకుల పేరు చెప్పుకుని పబ్బంగడుపు కొంటున్న నేటి వినాయకులు ఆ ఉద్యమం జోలికి పోకుండడం కూడా అదృష్టమే; వారు ప్రవేశించినంత కాలం అది రాజకీయం చేయబడదు. అయితే ఉద్యమాన్ని సపోర్టు చేయవలసిన బాధ్యత గల వారు "నన్ను ముట్టుకోకు" అన్నట్లుగా అంటీ పట్టనట్లు వ్యవహరించడం మాని, అందరికీ ఆమోద యోగ్యమైన, ఆరోగ్యదాయకమైన ఈ ఉద్యమానికి చేయూత నిచ్చి సహకరించాలి.

ఐ. రఘురామమూర్తి

నెల్లూరు.

### మా ఆరోగ్యం కాపాడండి మహాప్రభో

రామలింగాపురం ప్రాంతంలో కొరవ 8 పేజీలో

కొరవ 8 పేజీలో

సింహపురి

# సర్వోదయలో సరికొత్త ప్రయోగం

సర్వోదయ కాలేజిలో ఒక కొత్త ప్రయోగం చేస్తున్నారు. కాలేజి ఆవరణంలో క్రమశిక్షణ పెంచడానికి ప్రయత్నిస్తున్నారు. ఎందువల్లనో మొదటి నుంచి సర్వోదయ కాలేజిలో విద్యార్థులపై అదుపు లేదు; లెక్చరర్లన్నా, ప్రిన్సిపల్ అన్నా భయంలేదు. ఎంత విచ్చలవిడికి పేరు పడ్డప్పటికీ విఆర్ కాలేజిలో మాత్రం సగం మంది అయ్యవార్లంటే పిల్లలకు భయమే; ఎదురు పడితే గౌరవమే ! ఆ పరిస్థితి సర్వోదయలో లేదు. మేనేజిమెంట్‌లోని వర్గాలు, పేచీలు, రచ్చలు, రావిళ్లు విద్యార్థులకు యాజమాన్యమంటే అలుసు కావడానికి కారణమై వుంటాయి. ఈ మధ్య, కాలేజికి ఏ సంబంధమూలేని అల్లరిమూక ఆవరణంలోనే తిష్ట వేసి నానా రభస సృష్టించడం అలవాటైపోయిందట. అది భరించలేని దశకు చేరడంతో, అయ్యవార్లందరూ తెగించి, ఒకటిగా కలిసి, పిల్లలపై దండాస్త్రం ప్రయోగిస్తున్నారు. కాలేజి జరిగే సమయంలో, విద్యార్థులు తప్ప ఇతరులెవరూ లోపలికి రాకూడదు. గేటు దగ్గర డ్యూటీలు వేసుకొని, లెక్చరర్లు నిలబడి, ఐడెంటిటీ చూసి, మరీ లోపలకు దులుతున్నారు. లోపలకు వచ్చిన విద్యార్థులు క్లాసు రూములలో కూర్చోవాలి తప్ప, ఆవరణంలో షికార్లు చేయకూడదు. తిరిగితే అయ్యవార్లు దబాయిస్తున్నారు. పది, పదిహేను రోజుల నుంచి కాలేజి వాతావరణమే మారిపోయింది.

ఎందుకు పుట్టిందో కాని, అయ్యవార్లకు మంచి బుద్ధి పుట్టింది. దాన్ని కొనసాగించ గల్గితే కాలేజి బాగు పడుతుంది. ఆరంభ శూరత్వం మాదిరి పదిరోజులు దడబడలు చేసి, ఆ తర్వాత వదిలేస్తే మాత్రం మరీ అధ్వాన్న మౌతుందన్న సంగతి గుర్తుంచుకోవాలి!

ఈ ప్రేరణతో కాబోలు వెంకటగిరి గోపాలస్వామి కాలేజిలోనూ క్రమశిక్షణ నెలకొల్పడానికి ప్రయత్నం ప్రారంభమైంది. ముందుగా, లెక్చరర్లందరూ ఉదయం నుంచి సాయంత్రం వరకు విధిగా కాలేజిలోనే వుండాలని నిర్బంధం విధించారట. అయ్యవార్లకు జైలు శిక్ష విధించినంత కష్టంగా వుందది. విద్యార్థులకూ అటెండెన్స్ కంపల్సరీ అని నియంత్రించ బోయారట గాని, అందరు పిల్లలూ క్లాసులకు అటెండ్ అయితే కూర్చోవడానికి స్థలం చాలక ఇబ్బంది ఎదురయ్యే టప్పటికి, ఆ నియంత్రణను వదిలేశారట.

> విద్యార్థులే
> కాలేజికి
> రావాలి;
> ఆవరణంలో
> తిరిగితే
> అయ్యవార్లే
> దబాయిస్తున్నారు.

వి ఆర్ కాలేజిలోనూ లెక్చరర్లు విధిగా క్లాసులు తీసుకోవాలనే నిబంధనను మెత్తగా, నెప్పి తగలకుండా అమలు పరుస్తున్నారు. విఆర్ సిలో ఏ మాత్రం తొందర పడినా, పాతుక పోయిన మర్రి వృక్షాలు ఎదురు తిరుగుతాయి కదా? సర్వోదయ ప్రయోగం విజయవంతమైతే, కాలేజి తరులను లోపలకు రాకుండా నిషేధం విధించే ప్రయత్నం విఆర్‌సిలోనూ చేయాలనే ఆలోచన వుందట.

కాలేజీల నిర్వహణలో ఒక్కసారి అందరికీ మంచి బుద్ధులు పుట్టడం సంతోషించవలసిన విషయం; ఈ ప్రయత్నాలకు తల్లిదండ్రులూ సహకరించడం మంచిది.

## మునిసిపల్ హైస్కూలు పేరు మార్పు

నెల్లూరు టౌన్‌లో భక్తవత్సల నగర్‌లోని మున్సిపల్ హైస్కూలు పేరును "శ్రీ కురుగంటి నాగిరెడ్డి మున్సిపల్ హైస్కూలు" గా మార్చేందుకు రాష్ట్ర ప్రభుత్వం ఉత్తర్వులు జారీ చేసింది. రెండు సంవత్సరాల క్రితం నెల్లూరీయుడు

కొరవ 11 పేజిలో

# సణుగుడు

* ఆడ ఎమ్మెల్యే కంటి నీరుతో ఆడపడుచుల మానం క్షాళనౌతుందా?
* దేవుడ్ని పూజించడానికీ ప్రచారమా?
* ఇళ్ల పన్నుల భారం చేత కాని పౌరులకే, సినిమా హాళ్లకు లేదు!

ఈ వారం సంగతులేమిటి?

ఏముంటాయి? దినపత్రిక తెరిస్తే అత్యాచారాలు, హత్యలు; వార పత్రికలు తీస్తే స్కాములు, స్వాహాలు.

అంతకంటే విశేషాలు లేవా?

లేకేమి, ఒక ఆడ ఎమ్మెల్యేగారు కంట తడిపెట్టారట. దినపత్రికల్లో ప్రముఖంగా వచ్చింది.

కలకంఠి కంటనీరొలికితే, బుగ్గలు కంది, ఎర్రబడి, కంటి కింపుగా వుంటుందన్నది కదా నేటి మగజాతి సిద్ధాంతం; అదేక పెద్ద వార్తా?

ఏడ్చింది ఒట్టి ఆడపడుచు కాదు- శాసనమండలి సభ్యత్వం కల్గిన మహిళామణి. అందుకే అంత విశేషమైంది!

ఓట్లేసిన ప్రజలను ఏడ్పించడం తప్ప, ఎమ్మెల్యేలకు తాము స్వయంగా ఏడ్వవలసిన అవసరం ఎందు కొచ్చిందబ్బా ?

తన నియోజక వర్గంలోని ఆడపడచులు, కొందరు రౌడీల చేత నిత్యం మానభంగానికి గురౌతున్న తీరు విని తనకు తెలియకుండానే కంట తడి పెట్టిందట ఆమె.

మానభంగాలు మనకేమైనా కొత్తా- గ్రుడ్లలో నీళ్లు క్రుక్కు కోవడానికి; ఆమె చేతిలో ఆ సమయంలో గ్లిజరిన్ సీసా ఏమీ లేదు కదా?

అన్ని మాన భంగాల వంటివి కావివి; కంటికి నదురుగా కన్పడిన స్త్రీలను వారి ఇళ్లలోనే, వారి భర్తలు, అన్నలు, అమ్మ, నాన్నల ఎదుటే తిరిగ్గా అనుభవించే వెరీ స్పెషల్ నేచర్ గలవి; పొరపాటున కూడా పత్రికలకు, పోలీసుకు తెలియనివి. బకాసురుడు వంతు వేసుకుని రోజూ ఒకర్ని భోంచేసినట్లు, రోజా కొక పడతిని నంజుక తినడం అక్కడలవాటు. హోటల్‌కు వెళ్ళి అన్నం తినిపోయి నంత సులభంగా ,ఇంటి కొచ్చి ఆ ఆకలి తీర్చుక పోయే రాక్షసులకు ఒళ్లప్పగించడం తప్ప, కుయ్ కుయ్ మనడానికి లేదట.




పొరపాటున అంటే, కడుపులో కత్తి కసక్కున దిగిపోతుంది.

ఇంతకూ ఎవరా దుర్మార్గులు ?

వారిని పేట రౌడీలంటారు.

ఆ ఊర్లో పోలీసులు లేరా? లేకేమి, వున్నారు! ఈ నిత్య మానభంగాల కేంద్రానికి . నూరు గజాలలో ఒక సబిన్‌స్పెక్టరు కాపురం కూడా వుంటున్నాడు.

ఆయనకు ఈ సంగతులు తెలియవా ?

కొరవ 10 పేజిలో

## వేమన సంఘ సంస్కరణ వెనుక

# సముద్రమంత సామాజిక చరిత్ర వుంది!

> గ్రంథ పరిశీలన
> * * *
> బి. వెంకటసుబ్బయ్య

వేమన పుట్టింది సకల భోగ భాగ్యాలతో తులతూగుతున్న కుటుంబంలో! సి.పి.బ్రౌన్ వ్రాసిన "Preface to Vemana"లో His family was powerful , ..." అన్నారు. అంటే ప్రజల మీద అధికార దర్పంగల దన్నమాట. ఐహిక సుఖభోగాలకు అలవాటు పడ్డ కుటుంబంతో వేమన విసిగి గుర్రై చెప్పి వచ్చేశారు. తన కుటుంబంలోని భోగలాలస జీవితం ఆయనకు ఎంత విరక్తి కలిగించిందంటే తాను పుట్టిన వంశాన్ని గురించి గాని, కనీసం ఇంటిపేరుగాని తన పద్యాల్లో ఎక్కడా ప్రస్తావించడానికి ప్రయత్నించలేదు. అందుకే ఆయన జననం బురద గుంటలో పుట్టిన తామర పువ్వువంటిదని చెప్పాలి. అందువల్లనే సంఘసంస్కరణమనే సూర్యోదయానికి ఆకర్షితుడయ్యారు ఆ మహాకవి.

వేమన స్త్రీలోలుడనడానికి ఎటువంటి సందేహం లేదు. భోగలాలస కుటుంబంలో పుట్టినవారు కాబట్టి అనివార్యం గానే ఈ వ్యసనానికి లోనై ఉంటారు. సమాజంలోని దుర్వ్యసనాల్లో అతిభయంకరమైన వ్యభిచారం గురించి ఆయన అచ్చతెనుగులో పచ్చిగానే వ్రాశారు. తప్పుచేసిన వాడు అంతర్వీక్షణ పొంది పశ్చాత్తా పడడం లోనే ఉంది గొప్పతనం. కవి అనుభవానుభూతులు కవిత్వంలో ప్రతిబింబిస్తేనే ఆ కవిత్వానికి శాశ్వతత్వం చేకూరుతుంది. అది ఆయన నుండి ధారావాహికంగానే పెల్లుబికింది.

వేమన స్త్రీలోలుడనే అపవాదును భరించలేక ఆయన వదిన ఆయనలో మార్పు తీసుకురావాలని తన మానాన్ని చూపించిందనే కట్టు కథను పరిశోధకుడైన సి.పి. బ్రౌన్ కూడా ప్రచారంలో పెట్టడానికి సాహసించలేదు. వేమన సంఘ సంస్కర్త కావడానికి వెనుక సముద్రమంత సామాజిక చరిత్ర ఉంది!

సంఘంలో వైపరీత్యాలకు మనిషిని వెంటాడుతున్న అరిషడ్వర్గాల - కామ, క్రోధ, లోభ, మోహ, మదమాత్సర్యాలు - ప్రభావంచేత సమాజంలో పెచ్చు పెరిగిన నిమ్నోన్నతాలు, కులతత్వం, వాటి దుష్ఫలితాలు - దుర్వ్యసనాలైన వ్యభిచారం, త్రాగుడు- ప్రజల్ని భీతిల్లజేసే దోపిడి, దొంగతనాలు . దౌర్జన్యం - వీటన్నింటికీ న్యాయన్యాయాలు విచారించడానికి న్యాయం . న్యాయనిర్ణేతలూ లేకపోవడం- ఇవే ఆనాడు వేమన ముందు తాండవించిన నగ్నసత్యాలు . కుళ్లికంపుకొడుతున్న ఆనాటి సంఘాన్ని ఏకాకిగానే ఎదుర్కొన్నాడని చెప్పడానికి సాక్ష్యం ఉంది.

"వేమన చెప్పిన వేదము
వేమనకే తెలుసు గాని
వినుడెరుగరొరుల్" అంటారు.

ఎవరికి పట్టింది మరి? ఎవరు వింటారు. "చదువు చదివేటయ్యలు" బ్రాహ్మణకులంలోనే వుండి పోతిరి. బ్రాహ్మలను తిట్టిపోసిన వేమన కవిత్వాన్ని వాళ్లు ముట్టుకుంటారా? అసలు వాళ్లని వేమన ఎందుకు తిట్టాడు?

"విప్రులెల్ల జేరి వెర్రికూతలు గూసి
సతి పతులను గూర్చి సమ్మతమున
మునుమువార్త ముంచ ముండెట్లు
మోసెరా."

"లంజ కొరకు మేడ నంజారు తినసాగి
యజ్ఞమెల్లగామయజ్ఞమాయె!
మొదట సోమయాజి తుదకామ
యాజిరా."

"బ్రాహ్మణులకు బెట్ట ఫలముగలదని
యంద్రు
కుక్కలకును బెట్ట కొదువ యేమి
ఇందునందు జీవుండొక్కడె యందురు."

ఒక మనిషి బజారు కెళ్లి తిట్లకు మళ్ళుకుంటాడంటే ఆయా సంఘటనలు అతడిని ఎంతగానో బాధకు గురిచేసి ఉంటేనేగాని అలావ్యవహరించడు. ఈ పద్యాల వెనుక మహాకవి ఆవేదన కడుపు దహించుకున్నంతగా ఉంది. అయితే సమాజంలో వీరికున్న గౌరవ స్థానాన్ని కవికాదనలేదు.

"బ్రాహ్మణులకు సకల భాగ్యంబు
లీవచ్చు
గౌరవింప వచ్చు గోరివారు
జ్ఞాన మొసగి జనుల గడతేర్చ
గలిగిన."

పైగా ఆనాటి కుహనా వేదాంతులకు వేమన చెప్పిన అద్వైతం మ్రింగుడు పడిందంటే నమ్మడం ఎట్టా! వేమన అద్వైతాన్ని ఎందుకొరకు ప్రచారంలో పెట్టారు? అతి భయంకరమైన పాప కృత్యాలు చేస్తూ సమాజం నీతి దప్పి ఉన్నపుడు ప్రజలకు నరక భయాన్ని చూపడం కంటే,

"తన్ను వెదకి జార తానెపో జీవుండు
తత్వ మరసి చూడ తానెయాత్మ
మన్ను మిన్నులేదు మాయతాలేదయా."

అని సిద్ధాంతీకరించారు. వేమన నఖశిఖ పర్యంతం ఈ అద్వైతమే ధ్వనిస్తూంది. సంక్షోభంలో చిక్కుకున్న సమాజాన్ని కాపాడడానికి ఇదొక్కటే మార్గంగా నిర్ణయించుకున్నారు. ఇదే ఆయన తలపెట్టిన సంఘ సంస్కరణలో తొలిమెట్టు.

"వేమన చెప్పిన మాటలు
సామంబున సకల వేదసారంబు

కొరవ 11 పేజిలో

# ఒక్క పోస్టుకు 30 బదలీ దరఖాస్తులు ఒక్కొక్క ఎమ్మెల్యే నుంచి వందకు మించి సిఫార్సులు

టీచర్ల బదలీల రచ్చతో జిల్లా ప్రజాపరిషత్ అట్టుడికి పోతూంది. దాదాపు నెలరోజులనుండి వేరొక కార్యక్రమం లేదు; వేరొక పనిలేదు. జిల్లాలో ఎంతమంది టీచర్లున్నారో అందరికీ నెల్లూరు పరిసరాలలోనే పోస్టింగులు కావాలి. నెల్లూరు నుంచి ప్రతి రోజు పోయివచ్చేట్లుండాలి; బస్ సౌకర్యం వుండాలి; నడవాల్సిన అవసరం రాకూడదు; అది హెచ్ఆర్ఏ గ్రామమైతే మరీ మంచిది. అందరు టీచర్లకీ అదే కోర్కె. నెల్లూరు, తోటపల్లి గూడూరు, ఇందుకూరుపేట, వెంకటాచలం, కోవూరు మండలాలపైనే అందరి కన్ను.

మండలాధ్యక్షులు, జిప్రప ఛైర్మన్ లేకపోవడంతో మొత్తం భారమంతా డిడిఒ శ్రీ సతీష్‌చంద్రపై పడింది. సతీష్ చంద్ర అందరికీ అందుబాటైన అధికారి కాదు; ఎవరి మాటా వినడని పేరు; బదలీ విషయంలో మాటలూ కరకుగా వుండినాయి; కాని చివరికొచ్చే సరికి టీచర్ల రాజకీయం ముందు ఆయన కరకుదనం నీరు గారి పోయింది. ఇప్పుడు టీచర్లకు కన్పడేది, ఆపద్బాంధవుల మాదిరి భావిస్తుండేది ఎమ్మెల్యేలను మాత్రమే. ఒక్కొక్క ఎమ్మెల్యే ఇంటి దగ్గర వంద, రెండు వందలకు తక్కువ లేకుండా జనం. సిఫార్సుల కోసం రోజుల తరబడి పడిగాపులు గాస్తున్నారు. బ్రతిమలాడుతున్నారు; తెలిసినవారిచేత ఒత్తిడులు తెస్తున్నారు; నిష్ఠూరాలు వ్యక్తం చేస్తున్నారు; బదలీ కాకుంటే బ్రతకడం కష్టమన్నట్లు ప్రాధేయపడుతున్నారు.

నెల్లూరు మండలంలోని ఒక్కొక్క టీచరు పోస్టుకు 30 బదలీ దరఖాస్తులు వచ్చాయట. ఒక్కొక్క ఎమ్మెల్యే, ఒకే పోస్టుకు రెండు మూడు సిఫార్సులు చేసిన సంఘటనలూ వున్నాయి. వారిచ్చిన మొత్తమొత్తం సిఫార్సు చీటీల సంఖ్య వందకు పైమాటే. ఆ సిఫార్సుల ప్రకారం బదలీ చేయడం ఏ అధికారికైనా అసాధ్యం; చేయకుంటే ఎమ్మెల్యేలకు కష్టం; పాపం డిడిఒ గారి పరిస్థితి జాలి పడాల్సినట్లుంది.

టీచర్ల బదలీకి ప్రభుత్వం ఒక స్థిరమైన, శాశ్వతమైన విధానం అమలు చేయక పోవడం. వల్లే ఈ పరిస్థితి. దానివల్ల పలుకుబడి కల్గిన, రాజకీయ వాదుల అండ కల్గిన ఉపాధ్యాయులు ఏళ్లతరబడి ఒకే స్కూలులో కొనసాగ గల్గుతున్నారు. ఏ సిఫార్సు లేని అమాయకులు ప్రతి సంవత్సరం బదలీలకు గురౌతున్నారు. ఉద్యోగం ఇచ్చేటప్పుడే, టౌన్‌లకు దూరంగా వుండే పల్లెల్లో నిర్ణీత కాలం పనిచేసి తీరాలనే నిర్బంధం పెడితే తప్ప ఈ బదలీల ప్రహసనం మారదు. టీచర్లు విధిగా స్కూలుకు హాజరు కావడం పట్లకూడా కఠినమైన నిబంధనలు ప్రవేశ పెట్టాలి. టౌన్‌లో కాపురం వుండి, బస్‌ల వేళలకు అనుకూలంగా, చుట్టపు చూపుగా స్కూళ్లకు వెళ్లివచ్చే వారికి ఉద్యోగాలెందుకు? అందరూ టౌన్‌లలోనే వుండాలంటే, ఉదయగిరి వంటి దూరప్రాంతం పిల్లలకు చదువు అవసరంలేదా ?

కొందరు టీచర్లు, కేవలం జీతం తీసుకోవడానికి మాత్రమే ఉద్యోగం వున్నట్లు భావిస్తున్నారు. అధికారులు విజిట్‌కు రాలేని గ్రామాలలో స్కూళ్లే నడవడం లేదు. సముద్ర తీరంలోని పలు పట్టపు పాళెంలలో, మరీ ఉప్పుకాలువ దాటవలసిన ప్రదేశాలలో అయ్యవార్లు బడి తీయడం అరుదుగా గాని జరగడం లేదు. ఆ పాఠశాలల్లో పిల్లలే వుండరు. ఇన్స్‌పెక్షన్ జరిగే రోజు, ఇల్లిల్లు తిరిగి, బ్రతిమలాడి, పదిమంది పిల్లలను పోగేసి,కూర్చొబెట్టి, బడివుందని రికార్డులలో చూపిస్తున్నారు. ఆ పాళెలలో కట్టి భవనాలు - మత్స్యకారులు తమ వలలు దాచుకోవడానికి, వచ్చిపోయేవారు విశ్రాంతి తీసుకోవడానికి మాత్రమే పనికి వస్తున్నాయి. అయ్యవార్లకూ కొన్ని ఇబ్బందులు లేకపోలేదు. పడుచు వయసులో వున్న స్త్రీలు బస్ సౌకర్యం లేని, కాలినడకన పోవాల్సిన పాఠశాలలతో పలు సమస్యలు ఎదుర్కొన వలసి వుంటుంది. కొన్ని సందర్భాలలో ప్రాణ, మాన రక్షణ ప్రమాదంలో పడుతుంటుంది. ఆ గ్రామంలో కాపురం వుండి, ఉద్యోగం చేయడమూ కష్టమే. తమ పిల్లల చదువులు, తల్లిదండ్రుల ఆరోగ్యం వంటి సమస్యలెదురౌతాయి. అటువంటి వారి విషయం సానుభూతితో పరిశీలించాల్సిందే. కాని, బదలీలు అధికారులు చేసినా, అనధికారులు చేసినా- జరుగుతుండేది రాజకీయ పలుకుబడులపైనే తప్ప, వాస్తవ పరిస్థితుల పరిగణనతో కాదు. అందువల్ల కొందరు తమ సర్వీసు మొత్తం తమకు నచ్చిన చోట వుండగ ల్గుతున్నారు; ఇంకొందరు ఎవరికి పనికిరాని ప్రదేశాలకు ఫుట్ బాల్‌వలె ఎవరో తంతే ఎగిరి పడుతున్నారు.

ఈ ఏడాది డిడిఒ గారు ఒక కొత్త ప్రయోగం చేయబోయారు; నెల్లూరు

కొరవ 8 పేజిలో

**మాటలోని కరకుదనం చేతల్లో పని చేయలేదు - టీచర్ల రాజకీయానికి తలొంచక తప్పలేదు!**

# హెక్టారుకు 4 లక్షల లాభం పళ్లు పులిసే రొయ్యల పంట!

19తేది పూడిపర్తి రొయ్యల ప్రదర్శనా క్షేత్రంలో హార్‌వెస్టను ప్రారంభిస్తున్న చేపల మంత్రి పొన్నాల లక్ష్మయ్య, కమీషనరు దానం, ఎమ్మెల్యే సి.వి శేషారెడ్డి, జాయింట్ కలెక్టర్ సాంబశివ రావు;వెనుక నిలబడి వున్నది ఫారం ప్రాజెక్ట్ డైరెక్టర్ డాక్టర్ హరన్.

నెల్లూరు జిల్లాలో రొయ్యల పెంపకం వెలంవెర్రి ఇప్పటికే అవధులు మీరి వుంది. మామూలు రైతు నుంచి, వందల కోట్లతో వ్యాపారాలు చేసేవారి వరకు ఆలస్యం చేస్తే వెనుకబడి పోతామన్నట్లు ఎగబడుతున్నారు. కాగితాలపై లెక్కలు వేసి, లక్షలు కోట్లు, కళ్లముందు కన్పడుతుంటే, కాలుచేయి నిలువక , ఆరాటపడిపోతున్నారు. అసలే ఉద్రేకంగా వున్న ఈ వ్యాపారాకర్షణను పూడిపర్తి ప్రదర్శనా క్షేత్రం మరీ వేడి పుట్టేట్లు చేసింది.

వెంకటాచలం మండలం పూడిపర్తిలో రెండున్నర సంవత్సరాల క్రితం కేంద్ర ప్రభుత్వానికి చెందిన బయోటెక్నాలజీ శాఖ, ఎంపిఇడిఎ సంస్థలు కలిసి ఒక రొయ్యల ప్రదర్శనా క్షేత్రం ప్రారంభించాయి. రైతులకు రొయ్యల పెంపకంలోని మెళకువలను ప్రదర్శించి చూపడమే దీని ఉద్దేశ్యం. ఈ సారి ఆ ఫారంలో రొయ్యల ఉత్పత్తి మరీ పళ్లు పులిసేటట్లు వచ్చింది. ఒకే ఒక పాండ్‌లో వారు మొన్న హార్‌వెస్ట్ చేస్తే, హెక్టారుకు ఆరున్నర టన్నుల రొయ్యలు లభించాయి. ఈ ప్రాంతానికి రికార్డు ఉత్పత్తి ఇది. దేశంలోని ఇతర ప్రాంతాలలో ఈ మాదిరి అధిక దిగుబడులు వచ్చినా - ప్రభుత్వ యాజమాన్యంలోని సంస్థ అంతటి ఉత్పత్తిని సాధించడం విశేష ప్రాచుర్యానికి కారణమైంది.

ఈ లెక్క ప్రకారం లాభనష్టాలు చూస్తే, హెక్టారుకు నికరంగా 4 లక్షల లాభం కన్పడింది. వ్యవసాయాధార వ్యాపకాలలో అది ఎంత గణనీయమైన ఆదాయమో ప్రత్యేకంగా చెప్పనవసరం లేదు. మొత్తం ఫారంపైన ఖర్చు, ఆదాయం చూసినా - హెక్టారుకు 3 లక్షలకు తగ్గడం లేదు. సగటు రొయ్యల ఉత్పత్తి హెక్టారుకు 5 టన్నులుగా వస్తున్నది.

విదేశీమేత, విదేశీ పరికరాలు వాడినా, స్వదేశీ యాజమాన్య పద్ధతులలో నిర్వహించిన ఫారం కావడం దీని ప్రత్యేకత. సాంకేతిక నిపుణులూ స్వదేశీయులే.

ఈ ఫలితం, రొయ్యల పెంపకం పట్ల జిల్లాలో - విపరీతమైన ఉత్సాహాన్ని కల్గిస్తున్నది. అయితే ఇతర వ్యవసాయ వ్యాపకాల మాదిరి ఇది సాధారణ రైతుకు

**పూడిపర్తి టాస్‌పార్క్ ప్రదర్శనా క్షేత్రంలో ఆరున్నర టన్నుల హార్‌వెస్ట్**

అలివయ్యేది కాదు. లక్షలలో పెట్టుబడి అవసరమౌతున్నది. ఈ ప్రదర్శనా క్షేత్రం వలె ఫారం నిర్మించాలంటే హెక్టారుకు కనీసం 6 లక్షల పెట్టుబడి తప్పదు. అందువల్లే అందరూ ఆశపడడం తప్ప, ఆలోచనలను ఆచరణకు తేలేక పోతున్నారు.

ఇంతింత పెట్టుబడి, సాంకేతిక పరిజ్ఞానం, అపరిమితమైన వనరుల కల్పన లేకుండా, మధ్య ఉం... రైతు స్థాయికి తగినట్లు ఒక టన్ను లోపల ఉత్పత్తి లక్ష్యంతో రొయ్యల పెంపకం చేపట్టినా - వ్యవసాయం కంటే ఎన్నో రెట్లు అధిక ఆదాయం చేకూరుతుంది. ఈ పద్ధతిలో పెంపకం చేపడితే, ఇటు రైతుకు అందుబాటు, అటు దేశానికి మేలు. ఎందుకూ పనికి రాని ఉప్పునీటి కయ్యలలో, చవుడు భూములలో, దేశానికి బలం చేకూర్చే డాలర్ల పంట పండించ వచ్చు.

కాని, రైతుల ఉత్సాహానికి తగినట్లు బ్యాంకులు ఆర్థిక సహాయం అందించక పోవడంతో ఈ పెంపకం పెద్ద పెద్ద పారిశ్రామిక సంస్థలకు మాత్రమే పరిమితమౌతున్నది. రైతు స్వంత పెట్టుబడితో చేసే వ్యాపారం కానే కాదిది; ఖచ్చితంగా బ్యాంకుల తోడ్పాటు వుండాలి. కాని వారు ముందుకు రావడం లేదు. దారి డొంకలుకూడా లేని పల్లెటూళ్లలో, సముద్రతీరంలో పెట్టే పెట్టుబడి పట్ల వారిలో విశ్వాసం కల్గడం లేదు. కేంద్ర ప్రభుత్వం సాంకేతిక పరంగా, దిగుమతి రాయితీల రూపకంగా ఎన్నో ప్రోత్సాహాలు ఇస్తున్నప్పటికీ - అప్పుల దగ్గరకు వచ్చేసరికి వెనుకడుగు వేస్తున్నది - అందువల్లే, టాటాలు, థాపర్‌లు ముందు మిగుల్తున్నారు. వారికి పెద్ద పెద్ద ఆర్థిక సంస్థలు పోటీలు పడి వందల కోట్లు క్రుమ్మరిస్తున్నాయి. చిన్న రైతు లక్ష అడిగితే మొండి చేయి చూపుతున్నాయి.

నిజానికి, ఈ పెంపకం ఎప్పటికైనా రైతులు చేయవలసిందే తప్ప, పారిశ్రామిక సంస్థలు చేయదగినది కానే కాదు.

కొరవ 12 పేజిలో

## కోట మండలం యుటిఎఫ్ కార్యవర్గం

కోట మండలం యుటియఫ్ శాఖకు ఈ క్రింది కొత్త కార్యవర్గం ఎన్నికైంది. అధ్యక్షుడుగా శ్రీ కె. వెంకటాచలం, ఉపాధ్యక్షులుగా శ్రీ కె. చెంగయ్య, యస్. కె. అబ్దుల్ గఫార్; ప్రధాన కార్యదర్శిగా శ్రీ డి. జాన్ పీటర్, కార్యదర్శులుగా శ్రీ ఎ. వాగేశ్వర రావు, శ్రీఎ. ఉపేంద్ర రెడ్డి ఎన్నికైనారు.

సురేష్ రెడ్డి గారూ - విచారించండి!

## సూళ్లూరుపేటలో బ్రేక్ ఇన్స్‌పెక్టరాఫీసు

తడలోని రవాణా శాఖ బ్రేక్ ఇన్స్‌పెక్టరు కార్యాలయాన్ని సూళ్లూరుపేటకు మార్చారు. నాయుడుపేట, ఓజిలి మండలాలను గూడూరు నుంచి తొలగించి దీనికి కలిపారు.

# జిల్లా వార్తలు

## ఇందుపూరు పాల ఫిర్యాదు

అల్లూరు మండలం ఇందుపూరు గ్రామంలో పాల సొసైటి సక్రమంగా పనిచేయడం లేదని ఒక గ్రామస్తుడు ఫిర్యాదు చేస్తున్నాడు. వెన్న శాతం సరిగా చూడడం లేదట; చూసినది పుస్తకాలలో సక్రమంగా వ్రాయడం లేదట. అన్యాయంగా నష్టపోతున్నామన్నది ఆ గ్రామస్థుడి ఆవేదన.

తడ బ్రేక్ ఇన్స్‌పెక్టర్ పదవి అంటే, ఆదాయంలో కమీషనరుద్యోగాన్ని మించిందని పేరు. ఆ స్థానానికి బదలీ చేయించుకోవడానికి రెండు లక్షలు ఇవ్వజూపుతున్నారట. అంటే ఆ స్థానంలో వారి ఆదాయం ఎంత వుంటుందో అర్థం చేసుకోవచ్చు. మద్రాసుకు బియ్యం, సారాయి స్మగ్లింగ్ జరిగినంత కాలం ఈ పోస్టు బంగారు గని క్రిందే లెక్క.

కొరవ 12 పేజిలో

## నెల్లూరు నలుచెరగుల్లో
## వీక్షకుడు

### ముఖ్యమంత్రి

ముఖ్యమంత్రి శ్రీ ఎన్.జనార్దనరెడ్డి 7తేది ఉదయం నెల్లూరు వస్తున్నారు. పద్మశ్రీ వివాహంలో పాల్గొనడం కోసం వస్తున్నారాయన. ఆ రోజు సర్వేపల్లి, 8తేది వెంకటగిరిలలో పలు కార్యక్రమాలు ఏర్పాటౌతున్నాయి. అధికారికంగా ఇంకా కార్యక్రమం నిర్ణయం కాలేదు.

### జానకిరాం అనారోగ్యం

గనుల మంత్రి శ్రీ మాదాల జానకిరాం పాండిచ్చేరి వెళ్లినట్లు ధృవపడని వార్త. ఆరోగ్యం సరిగా వుండక పోవడంతో, చికిత్సకు వెళ్లినట్లున్నారు. ముఖ్యమంత్రి రాకకు రెండుమూడు రోజుల ముందు నెల్లూరుకు రావచ్చునంటున్నారు.

### పద్మశ్రీ పెళ్లి

నెల్లూరు పార్లమెంట్ సభ్యురాలు కుమారి పద్మశ్రీ వివాహం ఆగ 5తేది ఉదయం 8గంటలకు టౌనుహాల్ కాలేజీలో జరుగనున్నది. వరుడు కాకతీయ విశ్వవిద్యాలయం ప్రొఫెసర్ శ్రీ తిగిరిపల్లి కృష్ణకాంత్. వరంగల్‌లో వుంటున్నారు; పశ్చిమగోదావరి జిల్లా వాస్తవ్యుడు. ముఖ్యమంత్రితో సహా పలువురు అధికార, అనధికార ప్రముఖులు విచ్చేయుబోతున్నారు.

కొత్త లోకసభకు ఎన్నికైన తర్వాత వివాహ మాడుతున్న రెండవ మహిళా సభ్యురాలు కుమారి పద్మశ్రీ.

### ద్విశతాబ్ది వుత్సవం

నెల్లూరు జిల్లా ద్విశతాబ్ది వుత్సవ కమిటీ ప్రథమ సమావేశం 24 తేది జరిగింది. డాక్టర్ బెజవాడ గోపాలరెడ్డి గారు అధ్యక్షించారు. ఇన్‌ఛార్జి కలెక్టరు శ్రీ సాంబశివరావు వుత్సవ వుద్దేశ్యాలను వివరించారు. జిల్లా ఏర్పడి రెండు వందల సంవత్సరాలైనవనే దానిలో సందేహాలకు అవకాశం లేదని ఆయన నొక్కి చెప్పారు.

సమావేశానికి కొత్త వాళ్ల కంటే పాతవాళ్లు, యువకుల కంటే వృద్ధులు ఎక్కువ మంది వచ్చారు. వేమారెడ్డి వెంకు రెడ్డి, స్వర్ణావేమయ్య, బస్వారెడ్డి శంక రయ్య, కోవి రామయ్య చౌదరి... వంటి వారి ముఖాలు చాలా కాలం తర్వాత చూడగలిగాము. కొత్త శాసనసభ్యులలో ఇద్దరే – జె.కె. రెడ్డి, డాక్టర్ బి. సుందర రామరెడ్డి – మాత్రం వచ్చారు. తక్కిన వారంతా అన్యకార్య నిమగ్నులట. ఈసారి మీటింగు ఎక్కువ మందితో నిండు పేరోలగం కాబోతుంది.

సమావేశంలో ఆరు ఉపసంఘాలకు అధ్యక్షుల నియామకం జరిగింది; గోపాలరెడ్డి గారు ఉత్సవ కమిటీకే కాదు, సావనీర్ కమిటీకి కూడా అధ్యక్షులు; ఫైనాన్స్ పోర్టుఫోలియా శ్రీ మాగుంట సుబ్బరామరెడ్డికి, ఏర్పాట్ల శాఖ జె.కె. రెడ్డికి కేటాయించబడ్డాయి. డాక్టర్ సి. వి. రామచంద్రరావు గారి చేత జిల్లా చరిత్ర వ్రాయించి ప్రచురించాలని నిర్ణయించ బడింది. మరో ముఖ్యమైన కమిటీ ఆధిపత్యం – జిల్లా సమగ్రాభివృద్ధి పథకాలు – డాక్టర్ సుందర రామరెడ్డికి అప్పగించబడింది.

బహుశా వుత్సవాలు సెప్టెంబరు ఆఖరులోగాని, తప్పితే డిసంబరులోగాని జరపడం అనుకూలమనే అభిప్రాయం వ్యక్తమైంది. ముఖ్యమంత్రి అభిప్రాయం ప్రకారం కూడా డిసెంబరే నిర్ణయం కావచ్చు.

### పన్నుల పెంపకు నిరసన

మునిసిపాలిటీలు ఆరురెట్లుగా పన్నులు పెంచడాన్ని అఖిల పక్ష కమిటీ సమావేశం తీవ్రంగా నిరసించింది. దాన్ని వ్యతిరేకించ దానికి వుద్యమం కూడా నిర్వహించడానికి సూచనలు వచ్చాయి. సమావేశంలో కాంగ్రెస్ శాసనసభ్యులు జె.కె.రెడ్డి, నువ్వుల వెంకటరత్నం నాయుడు గారలు కూడా పాల్గొన్నారు. పన్నుల పెంపకం నిరసనలో వీరూ తమ గొంతు కలిపారు. జె.కె.రెడ్డి ఒక ప్రత్యామ్నాయ ప్రతిపాదన చేసినట్లున్నారు. పెంచిన పన్నులు మాత్రం ఎవ్వరూ కట్టలేరు; సవరణ జరక్కుంటే పన్నుల నిరాకరణ వుద్యమాన్ని ఎదుర్కోవలసి వస్తుందేమో- మెలుకువ పడండి!

అదే సరే కాని – టవున్ శాసన సభ్యుడు అఖిల పక్షంలో కలిసే బదులు, తాముగా ఎందుకు ఎరవ తీసుకోలేక పోయాడు? సింహపురి సేవా సమితి తరపున శ్రీ ఆనం వివేకానందరెడ్డి పన్నులు వసూలు నిలపాలనే ఉద్యమం ప్రారంభించారు; రేపు 3తేది టౌనులోని అన్ని వర్గాల ప్రజలతో సమావేశమై, పన్నుల నిరాకరణోద్యమం ప్రారంభిస్తారు.!

### ఒక ఖండన

10.7.92 జమీన్‌రైతులో చేపల రుణాలకు సంబంధించి వెలువడిన వార్తలో తన ప్రస్తావన నిరాధారమైనదని, తనకు వాటితో ఎలాంటి సంబంధమూ లేదని, సర్వేపల్లి మాజీ ఎం.ఎల్.ఎ శ్రీ ఈదూరు రామకృష్ణారెడ్డి ఒక ఖండన పంపారు.

సంబంధం లేకుండా లేనిది కల్పించి వ్రాయడం మాకు వినోదమేమీ కాదు. వ్యక్తిగతంగా ఎవరినీ నొప్పించడమూ మా అభిమతం కాదు. మరో మాటుసరి చూచుకొని తర్వాత చెప్తాము.

### కృష్ణపట్నానికి క్లియరెన్స్

కృష్ణా పట్నంలోథర్మల్ స్టేషన్ నిర్మాణానికి కేంద్ర పర్యావరణ శాఖ అనుమతి మంజూరు చేసింది. ఆ మధ్య నెల్లూరును సందర్శించిన నిపుణుల కమిటీ నివేదిక ఆధారంగా ఈ అనుమతి నిచ్చారు. విశాఖ పట్నం థర్మల్ స్టేషన్‌కు ఇది వరకే అనుమతి వచ్చిందట. అయితే బొగ్గులింకేజీకి ఇంకా మంజూరు రాలేదు. ఒరిస్సాలోని తాల్చేరు నుంచి లభ్యమయ్యే బొగ్గును ఇప్పటికే విశాఖ పట్టణం థర్మల్ స్టేషన్‌కు కేటాయించడంవల్ల, కృష్ణా పట్నానికి లభ్యత వుంటుందో లేదోనన్న సందేహం ఒకటుంది. అందువల్ల విదేశాలనుంచి బొగ్గు దిగుమతి చేసుకొనే ప్రతిపాదనను పరిశీలిస్తున్నారు.

సెప్టెంబరులో ప్రధాని చేత దీనికి శంఖుస్థాపన చేయిస్తారన్నది నిజంకాదు. రెండున్నర వేల కోట్ల పెట్టుబడి అవసరమైన ఈ భారీ ప్రాజెక్టును ఎవరు చేపట్టాలనే విషయం ఇంకా నిర్ణయం కాలేదు. రాష్ట్ర విద్యుత్ బోర్డుకు దానిని స్థాపించే శక్తి లేదు. ఎన్‌టిపిసి కూడా తన అశక్తత తెల్పింది. అందువల్ల ప్రైవేటు పారిశ్రామిక సంస్థలే ముందుకు రావాలి. కృష్ణపట్నానికి అమెరికాలోని ఒక ప్రవాస భారతీయుడు ఆసక్తి చూపుతున్నారు.

### రుక్మిణమ్మ మరణం



జమీన్‌రైతు మేనేజరు శ్రీ బి. వనమాలి మాతృమూర్తి శ్రీమతి బి. రుక్మిణమ్మ 30 తేది మధ్యాహ్నం హైదరాబాదులో హఠాత్తుగా మరణించారు. అర్థ శతాబ్దం పాటు అవిరామంగా పనిచేసి, జమీన్‌రైతుకే తన జీవితాన్ని అంకితం చేసిన మాజీ మేనేజింగ్ ఎడిటర్ స్వర్గీయ తూపిలి పార్థసారథి సతీమణి ఆమె. కుమార్తె ఇంటిలో వుండి, స్వల్ప అనారోగ్యంతో ఆస్పత్రికి వెళ్తూ, దారిలోనే గుండె పోటుకు గురై, అనాయాసంగా, తృటిలో కన్నుమూసిన పుణ్యాత్మురాలు. ఆమెకు ఒక కుమారుడు, ఇద్దరు కుమార్తెలు వున్నారు. వనమాలి కుటుంబానికి మా సానుభూతి.

## జనార్దనరెడ్డి

(మొదటి పేజీ తరువాయి)

కాకుండా ఖర్చు పెట్ట వలసి వుంటుంది. ఆస్పత్రి కట్టవలసి వుంటుంది. వీటన్నింటిని సమకూర్చుకోవడం సంపన్నులకు తప్ప, సామాన్యులకు సాధ్యం కాదు. వాటిని చూపగల్గిన వారికే నిపుణుల కమిటీ సిఫార్సు చేసిందని, ఇందులో తన ప్రమేయమంటూ ఏమీ లేదని ముఖ్యమంత్రి ప్రజలకు నచ్చ చెప్పాలను కుంటున్నారు. కోట్ల రూపాయల ముడుపులు తీసుకొని కాలేజీలు అమ్మకానికి పెట్టారన్నది కేవలం నింద మాత్రమేనని ప్రజలకు తెలియ జేయాలనుకుంటున్నారు.

మెడికల్ కాలేజిల రద్దులో అనకాపల్లి అసమ్మతి సభ తెరమరుగై పోయింది. సభకు ఆశేషంగా జనాన్ని సమీకరించినా - తగినంత మంది కాంగ్రెస్ వాదులను, ఎమ్మెల్యేలను రప్పించలేక పోవడంతో మొత్తం ప్రయత్నం వృధా అయింది. సభలో రాష్ట్ర ప్రభుత్వాన్ని, ముఖ్యమంత్రిని నిందించ వద్దని ఢిల్లీ పెద్దలు చేసిన సూచనను ఎవరూ ఖాతరు చేయలేదు. అనుకున్న దానికంటే అధిక సంఖ్యలో జనం రావడంతో, ఉత్సాహం ఆపుకోలేక వక్తలందరూ రాష్ట్రప్రభుత్వంపై తమ అక్కసును బాహాటంగానే వ్యక్తం చేశారు. ముఖ్యమంత్రిని తొలగిస్తామని శపథాలు చేశారు.

కనీసం పదిమంది లోక్‌సభ సభ్యులైనా ఈ బల ప్రదర్శనకు వస్తారని రాజశేఖర రెడ్డి భావించారు. కాని, తనతో సహా కేవలం నలుగురిని మాత్రమే తీసుక రాగల్గారు. ఒక్క రాష్ట్ర మంత్రి హాజరు కాలేదు. నిత్యం తిట్ల వర్షం కురిపించే సంగీతం వెంకట రెడ్డి కూడా రాలేదు. ఎమ్మెల్యేల సంఖ్య సైతం ముచ్చటగా మూడు మాత్రమే. పేరు పడిపోయిన ముద్రగడ, కెఇ కృష్ణమూర్తి, జక్కంపూడి రామమోహన రావులు మాత్రమే వచ్చారు. రాష్ట్ర శాసన సభా పార్టీలో ముప్పాతిక భాగం మంది ఎమ్మెల్యేలు ముఖ్యమంత్రి పట్ల అసంతుష్టులై వున్నారని వీరు చెప్తున్న ప్రచారానికి, హాజరైన శాసన సభ్యుల సంఖ్యకు పొలికే లేదు.

మొత్తం మీద అంత ప్రచారంతో, ఆర్భాటంతో జరిపిన అనకాపల్లి సభ అసమ్మతీయులకు ఏ మాత్రం ఉపయోగపడలేదు. నోటినిండా తిట్టగలిగామన్న తృప్తిని మాత్రం మిగిల్చింది.

* * *

పిసిసి అధ్యక్షుడు శ్రీ మర్రి తులసి దాస్‌పై విశాఖ పట్టణం విమానాశ్రయంలో, రాజశేఖర రెడ్డి సమక్షంలో జరిగిన దాడి పెద్ద రాజకీయ రభసను ప్రేరేపించేటట్లుంది. కారణం ఏదైనాకాని పిసిసి అధ్యక్షుడికి కాంగ్రెస్ కార్యకర్తల చేతనే అవమానం జరగడం పార్టీ ప్రతిష్టను దిగజార్చింది. తులసీదాస్ ఈ సంఘటనను ప్రధాని దృష్టికి తీసుకవెళ్లనున్నాడు. ఎఐసిసి పెద్దలు ఎట్లా ప్రతిస్పందిస్తారో వేచి చూడాలి!

### ఆత్మకూరు డిస్ట్రిక్టు మునసబు వారి కోర్టులో

EP No.134/90 OS No. 134/86

గారంశెట్టి పార్వతమ్మ —వాది/DHr

బతేపెర మాలకొండారెడ్డి —ప్రతివాది/JDr

ఈ క్రింద కనపరిచిన ప్రతివాది తాలూకా స్థిరాస్తిని పై కోర్టు వారి ఎదుట 3.8.92 తేది 10.30 గంటల నుండి సాయంత్రం 5 గంటల లోపల వేలం వేయబడును. కావున పై వేలములో పాల్గొన దలచిన వారు కోర్టు వారి ఎదుట హాజరై వేలంలో పాల్గొన వచ్చునని యిందు మూలముగా తెలియజేయడమైనది.

#### షెడ్యూలు

నెల్లూరు రి.డి. ఉదయగిరి సబ్.రి. దుత్తలూరు మండలం రాచవారి పల్లి గ్రామంలో ప్రతివాది హక్కు, అనుభవం గల స్థిరాస్థి వివరం

| వ.నెం. | పట్టానెం. | సర్వే నెం. | పూర్తి విస్తీర్ణం | అనుభవం | వాది క్రయం | అమీనా క్రయం |
|---|---|---|---|---|---|---|
| 1. | 7 | 27/4 | య 1.79 ట్లు | య 1.79 ట్లు | 1000 | 1074 |
| 2. | 154 | 88/1 | య 0.55 ట్లు | య 0.55 ట్లు | 250 | 330 |
| 3. | 59 | 86/16 | య 0.44 ట్లు | య 0.44 ట్లు | 170 | 264 |
| 4. | 263 | 71/4 | య 7.02 ట్లు | య 7.02 ట్లు | 3500 | 4212 |

గమనిక: EC ప్రకారం ఏలాటి అన్యాక్రాంతములు లేవు గనుక నిరాటంకముగా యాలం వేయబడును.

టి. వేణుగోపాల్, వాది తరఫు అడ్వకేటు







## రంగడి

(మొదటి పేజీ తరువాయి)

రాలేదు, చాలా తెలివిగా, శాస్త్రం ప్రకారం చేశారీ ప్రయత్నం. గర్భగుడిపైన ఒక వరుస పెద్ద పెద్ద బండలున్నాయట; వాటిపైన పది వరుసల ఇటుక రాళ్లున్నాయి. ఏదో రసాయనం పోసి, ఇటుకలను శబ్దం లేకుండా వూడదీశారట. రోజూ రాత్రి 10.00 గంటల ప్రాంతంలో రావడం, ఒకటి రెండు వరుసల రాళ్లు తొలగించడం, సైగ్గా వెళ్ళిపోవడం జరుగుతుండేది. మంగళవారం రాత్రి అదే ప్రకారం రాళ్లు తొలగిస్తుండేటప్పుడు, బండ శబ్దమైందట. దానితో వాచ్‌మెన్ మేలుకొన్నాడట. అంతా తిరిగి చూసినా ఏమి కన్పడ లేదట. అద్దాల మహల్‌లో ఏదో రేకు శబ్దమని భావించాడట; కాని అనుమానం తీరక ప్రధాన గాలిగోపురం పైన ఇటీవల అమర్చిన సెర్చ్‌లైట్ వేసి చూశాడట. అప్పుడు కన్పడ్డారు దొంగలు. అయితే ఆ వాచ్‌మెన్ తెలివిగా ప్రవర్తించి, కేకలు పెట్టకుండా, లైటు ఆర్పేసి, సైగ్గా వీధిలోకి వచ్చి, చుట్టుప్రక్కల ఇళ్లలోని వారిని కలుపుకొని, దేవాలయం చుట్టు ముట్టించాడట. అప్పటికే వారు క్రిందకు దూకి పారిపోజూశారు. ఇద్దరు తప్పించు కున్నారు; ఒకరు జనం చేతికి చిక్కారు; ఇంకొకరు పరుగెత్తడంతో కాలు జారి పెన్నలోని ఒక నీటి మడుగులో పడడంతో వారిని పట్టుకున్నారు. ఆ ఇద్దర్నీ పోలీసుకు అప్పగించారు. మనోహర్, మోహన్ అనే వీరిద్దరిదీ గిడ్డంగి వీధి అట; శివయ్య అనే కోవూరు వాస్తవ్యుడు, నారాయణ అనే అల్లగడ్డకు చెందిన ముఠానాయకుడు తప్పించుకున్నారు. వాచ్‌మెన్ అంత నిరీక్షలవగా చూడకపోయివుంటే, వారు లోపలకు దూరి విగ్రహాలు తస్కరించి వుండేవారు; చూడగానే కేకలు పెట్టి వుండినా పారిపోయివుండేవారు. వారిదగ్గర ఆ సమయంలో కత్తులు, గొడ్డళ్లు, బరిశెలు, కూడా వుండినాయట. తస్కరించిన విగ్రహం దాచడానికి పెన్న ఇసుకలో పెద్దగొయ్యి త్రవ్వి పెట్టివుండినారట. ఇంత మెళకువగా ప్రవర్తించిన వాచ్‌మెన్లు గుండుబోయిన బుజ్జయ్య, బి.వెంకయ్యలకు ఎస్పిగారు పారితోషికం ప్రకటించారు. పోలీసు ముఠానాయకుడి కోసం వెతుకుతూ వుంది!

## పంచాంగము

### వరలక్ష్మివ్రతము

తేది 7 శుక్రవారము వరలక్ష్మి వ్రతము

### ఆగస్టు తిథులు

శ్రావణ శుద్ధ

| | | | | |
|---|---|---|---|---|
| తే 1 | శని | తదియ సా.గ. | 6.10 వ |
| తే 2 | ఆది | చతుర్థి ప.గ. | 3.50 వ |
| తే 3 | సోమ | పంచమి ప.గ. | 1.45 వ |
| తే 4 | మంగళ | షష్ఠి ప.గ. | 11.50 వ |
| తే 5 | బుధ | సప్తమి ప.గ. | 10.20 వ |
| తే 6 | గురు | అష్టమి ప.గ. | 9.00 వ |
| తే 7 | శుక్ర | నవమి ప.గ. | 7:30 వ |

స్వయంపాకుల శ్రీనివాసులు

జమీన్‌రైతు

సంవత్సర చందా రూ. 100.00

ఆరు నెలలకు రూ. 50.00

### కడప ఒకటవ జిల్లా జడ్జిగారి కోర్టులో

I.A.364/90 in O.P. /92

మాపూరి పుల్లమ్మ W/o. రామయ్య నరసింగు పల్లి H/o. రంగసముద్రము పొరుమామిళ్ల (మండలం) కడప జిల్లా - పిటీషనరు

VS

ఆర్ దుర్గా ప్రసాదరావు -రెస్పాండెంటు S/o. రావి. రాఘవయ్య . స్టోన్‌హవుస్ పేట- నెల్లూరు.

#### నోటీసు

పై నెంబరులోని పిటీషనరు తన భర్త యాక్సిడెంటులో మరణించి నందుకు గాను నష్టపరిహారమునకు గాను దాఖలు చేసిన పిటీషను లోని ఆలస్యమును మన్నించ గోరుతూ దావా దాఖలు చేసి యున్నది. అందును గురించి మీకు ఏమేని అభ్యంతరం ఉన్నయెడల 5-8-92 పై కోర్టులో హాజరై తెలుపుకోవచ్చును. లేనంతట పరోక్షముగా విచారణ జరుప బడును.

ఎ. నరసింహారావు
పిటీషనరు తరఫు అడ్వకేటు

కడప
15-7-92.

# శివారెడ్డి పద్యాలు

### నెల్లూరు చెన్నపట్నమొద్ది

కవులకెల్ల కాణాచి నెల్లూరు
పట్టణమ్ము నెలవు పండితులకు
అయిపోయింది టైము అరేబాలికరావు
కలము పూరుకోదు కలిబెరతరి!
కంటివింత జూస్తె కాసంత గోరంత
కాలుముందుకేస్తె కాంగిరేను
తెల్లవారెతలికి నెల్లూరు దిస్ట్రిక్టు
చెన్నపట్నమొద్ది చెప్పబోన్యం

### నే మంత్రినైత

ఎన్నికల్లో రేపు ఏమంత్రిగా వస్త
అక్షరాల నిజము, అతిశయోక్తి
కానేకాదు నాటు కవినోట మాటొస్తె
ఇంతవరకు కాని దేది లేదు!

### కవులకు కప్పుబుప్పము

సినితారలొస్తె చెవిగోసుకుంటారు
మదిమలొత్తుతారు మంత్రులొస్తె
కవులు బోతడేందో కప్పుబుప్పుంటారు
పెద్దతలలు అంత బుద్ది జాడ్యం!
సినిమాలోబొయ్యి జేరి అదుంటుంట
కాలమొక విధంగ గడుపుతుంట
తార్లదాపునుంటె తాతయ్య అయ్యాక
అంతకంటె భాగ్యమేమిగలదు !

## పినాకినితీరం

(2 పేజీ తరువాయి)

గాని, మరొక అసమ్మతీయుడు గాని ప్రజలను మరో విధంగా నమ్మించలేరు! ముఖ్యమంత్రి ఎవరు – కాంగ్రెస్ నాయకుడు కాదా? ముఖ్యమంత్రి అంటె రాష్ట్రంలో కాంగ్రెస్‌కు అధిపతి కాదా? ముఖ్యమంత్రి పదవిలో జనార్దన రెడ్డి వుండవచ్చు, మరొకరు వుండవచ్చు; ఆ పదవిలో వున్నవారిని దుష్టచారం ద్వారా అపఖ్యాతి పాల్జేయడమంటే, అతని మీద ధ్వజమెత్తడమంటే, అతని మీద బహిరంగంగా ఆందోళనా కార్యక్రమం చేపట్టడమంటె – రాష్ట్రంలో కాంగ్రెస్ సంస్థకు తీరని అపకారం చేయడం తప్ప వేరు కాదు. ముఖ్యమంత్రిని, కాంగ్రెస్‌ను వేరు చేయలేరు; కాంగ్రెస్‌ను అభిమానిస్తూ ఆ పదవిని కించపరచలేరు.

కేంద్రంలో ప్రధాని ఎంతో, రాష్ట్రంలో ముఖ్యమంత్రీ అంతే; దేశ స్థానంలో ప్రధాని ఎట్లా కాంగ్రెసో, రాష్ట్రంలో ముఖ్యమంత్రీ అంతే, కేంద్రంలో కాంగ్రెస్‌కు అసమ్మతి లేదా? ప్రధాని పి.వి.కి. వ్యతిరేకత లేదా? పవార్ ప్రధానిత్వాన్ని అభిలషించిన నాయకుడు కాదా? అర్జున్ సింగ్ పి.వి.కి అనుకూలుడా? పి.వి. విధానాలను వ్యతిరేకించే వారు పార్లమెంటు కాంగ్రెస్ సభ్యులలో ఎంతమంది లేరు? పార్లమెంటు కాంగ్రెస్ పార్టీ అంతా ఏకమేకంగా వుందా? కేంద్ర మంత్రులందరూ పి.వి. అనుకూలురేనా? ఎవరైనా బహిరంగంగా పల్లెత్తు మాట అంటున్నారా? వేదికల మీద గొణుగుతున్నారా? మంత్రివర్గం నుండి వైదొలగిన వారు సైతం ప్రతికూలంగా ప్రకటనలు చేస్తున్నారా? కేంద్రంలోని ప్రధాని వ్యతిరేకులందరూ వీరి వలె దండుకట్టుకొని దేశం మీదకు బయలు దేరారా? ప్రధానితో వ్యతిరేకత వుంటే, అభిప్రాయ భేదాలుంటె వాటిని అంతరంగానికి పరిమిత పరుచుకొని, బయటకు ఎంతో గంభీరంగా, హుందాగా వ్యవహరిస్తున్నారు. కాంగ్రెస్ శ్రేయస్సు పట్ల ఏ మాత్రం లక్ష్యం వున్నా అనుసరించ వలసిన సరైన విధానం, వైఖరి అదే! అంతే గాని అల్లరి చిల్లరిగా, ఆకతాయితనంగా, అఘాయిత్యంగా, వీధిన బడి పార్టీని భ్రష్టు పట్టించడం కాదు!

అనకాపల్లి అసమ్మతి సభ విజయవంతమో, విఫలమో ఆ చర్చ అనవసరం. అసమ్మతీయులు అనుకుంటున్నట్లు అఖండ విజయమనే చెప్పుకుందాం. కాని ఆ సభ ఎవరికి వ్యతిరేకం? ఎవరికి సవాలు? – ఒక్క క్షణం యోచిస్తె అది జనార్దన రెడ్డి మీద యుద్ధం కాదు; ఆయనకు సవాలు కాదు; సాక్షాత్తు ప్రధాని పి.వి.కే అదొక బెదరింపు. హెచ్చరిక అని బోధపడుతుంది. జనార్దన రెడ్డి మీద చార్జి షీట్లు అందించి నందువల్ల ప్రయోజనం లేకపోయింది; వ్యక్తిగతంగా నివేదించుకున్నందు వల్ల వుపయోగం లేకుండా పోయింది; మూకుమ్మడిగా పోయి మొరపెట్టుకుంటె ఫలితం లేకుండా పోయింది; పది మంది పార్లమెంటు సభ్యులను చేత పట్టుకొని తమ బలాన్ని ప్రదర్శించు కుంటే తప్ప, ప్రధాని మెడలు వంచడం సాధ్యం కాదనే నిర్ణయానికి వచ్చారు. దాన్ని కార్యాచరణే అనకాపల్లి సభ! పొయ్యి మీద వేస్తె వుడకడానికి పి.వి.వి అనప గుగ్గిళ్లు కావంటారు; ఇనప గుగ్గిళ్లు! అటువంటి పి.వి. మీద అనకాపల్లి ప్రదర్శనం ప్రభావం కించిత్ అయినా వుంటుందనుకోగలమా?

రాష్ట్రమంత్రి వర్గంలో ముప్పాతిక మంది ముఖ్యమంత్రికి వ్యతిరేకులైనపుడు, శాసనసభలో ఆయనకు బలం లేనపుడు, రాజశేఖర రెడ్డి ప్రభృతులకు ఈ కల్లాట్లన్నీ ఎందుకు – నేరుగా పార్టీలో అవిశ్వాసం తెచ్చి జనార్దన రెడ్డిని దించి వేయవచ్చు గదా? అడలేక మద్దెల ఓడనే దానితో సమానమే అనకాపల్లి సభల వంటి రాజశేఖర రెడ్డి వర్గ కార్యకలాపాలు!

కాంగ్రెస్‌ను రక్షించండి! అనే నినాదంతో బహిరంగ సభలను ప్రారంభించిన రాజశేఖర రెడ్డి ప్రచారానికి; కాంగ్రెస్‌ను దింపండి అని ప్రజలను ప్రబోధిస్తూ ప్రదర్శనలు జరిపే తెలుగు దేశం – బి.జె.పి. – కమ్యూనిస్టుల వంటి కాంగ్రెస్ శత్రువులకు తేడాలేదు!

## టీచర్లు

(5 పేజీ తరువాయి)

పరిసర మండలాలకు బదలీలు కోలే టీచర్లు కనీసం ఒక సంవత్సరం పాటు దూర ప్రాంతాలలో డెప్యూటేషన్‌పై పనిచేయాలనేది ఆ నిబంధన. అయితే, చివరికొచ్చే సరికి ఆ ప్రతిపాదన గాలికి ఎగిరి పోయింది. విపరీతమైన రాజకీయ వత్తిడుల ఫలితంగా ఆయనే దానిని

బుట్టదాఖలు చేశారు. పంచాయితీ స్కూళ్లు పుట్టినప్పటి నుంచి బదలీల భాగోతం నడుస్తూనే వుంది; ఎన్ని ప్రభుత్వాలు మారినా, ఎన్ని దశాబ్దాలు గడిచినా, ఎందరు అధికారులు వచ్చి పోయినా ఆ ప్రహసనం మాత్రం మారడం లేదు; ఇక మారదు కూడా!

## జనవాణి

3 పేజీ తరువాయి

నివాసముండడమే శాపమా అన్నట్లుంది పరిస్థితి. సౌత్ స్టేషన్ అండర్ బ్రిడ్జి ఎడతెగని దుర్గంధాన్ని వెదజల్లుతూ మా దౌర్భాగ్యాన్ని అనుక్షణం గుర్తు చేస్తుంటుంది. చిన్నవాన వస్తే చాలు - భూమి గుండ్రం అనే సామెత ప్రకారం, ఆత్మకూరు బస్టాండు మీదుగా తిరిగి రావాలి. ఒక్కోరోజు అదీ నీటితో నిండిపోవడంతో రంగనాయకుల పేటనుంచి రావలసి వస్తున్నది. పెద్ద దిబ్బలు, చినుకు వానపడితే మూడు మైళ్ల దూరం దుర్గంధం వెదజల్లుతున్నాయి. మునిసిపల్ అధికారులు మాపై కరుణ చూపి, మాకు కనీసం ఆరోగ్యవంతమైన గాలి, నీరు ప్రసాదించాలి

వాస్తురామచంద్రరావు

నెల్లూరు.

### ఆనందదాయకం ద్విశతాబ్ది ఉత్సవం

ఎంతో చరిత్రాత్మకమైన ఘనకీర్తి గలిగిన నెల్లూరు జిల్లా ద్విశతాబ్ది ఉత్సవాలను జరిపేందుకు ప్రభుత్వం వారు ఒక కమిటీని వేసినారని తెలిసికొని చాలా సంతోషిస్తున్నాను. ముఖ్యమంత్రి జనార్దనరెడ్డి గారి స్వస్థానమైన నెల్లూరు జిల్లా తన ద్విశతాబ్ది ఉత్సవాలు జరపడం విదేశాలలో ఉంటున్న నెల్లూరీయులందరికి మహదానందదాయకం. ఈ సంబరాన్ని పురస్కరించుకొని ప్రవాసులైన నెల్లూరీయులను కూడా సభలకు ఆహ్వానించి, సన్మానించడం సబబుగా ఉంటుంది. ముఖ్యంగా వారిలోని మహిళలను ప్రత్యేకించి గౌరవించాలని కోరుతున్నాను.

రావూరి సురేంద్రనాథ్

హైదరాబాదు.

## సగటు మనిషి కోరిక

☆ నిర్మలారుక్మాంగదన్ ☆

సుదూర వినీల ఆకాశమా
ఉంటివి ఎక్కడో
కాని – కనపడుచుంటివి
కంటి కెదురుగా....

భగ భగ మండే భానురాజమా!
సుదూర నివాస రవితేజమా—
నీతో చేరి మింటికి ఎగసే
అదుపు లేని ఈ ధరల తాకిడి
వచ్చుచున్నది నీతోపోటి

నింగిని నీవు, నేలను ధరలు
మధ్యన మేము, బ్రతకలేని
మా కరాళ కంకాళ బ్రతుకును
ఈడుస్తున్న మా ఏడుపు చూడు

బ్రతికీ బ్రతకని ఈ బ్రతుకును
బ్రతికించుకొనుటకై బ్రతుకుతున్న
ఈ మధ్య తరగతి మానవ బ్రతుకును చూడు

మలయ వీచికలు — మధుర హాసికలు
మంగళ గీతికలు — మనోరూపము
మరలి వచ్చునా — మరలి వచ్చునా
మరలా –మరలా — మరలి వచ్చునా.

రామలింగాపురంలో డ్రైనేజి పైపులకు కొళాయిల పైపులకు ఎడం లేదు; రెండూ కలిసిపోయి ఈ నీళ్లు దానిలోకి, ఆ నీళ్లు దీనిలోకి మారుతుంటాయి. త్రాగే నీళ్లలో మట్టి, చెత్త, మలమూత్రాలు కలిసి, పురుగులు పట్టి ఛండాలమైన గబ్బు కొట్టుంటాయి. సైడు కాలవలు శుభ్రం చేసేవారు లేక, అండర్ గ్రౌండ్ డ్రైనేజి మ్యాన్‌హోల్లు క్లీన్ చేసే గతి లేక రోడ్లంతా మురికినీరే. కొన్ని చోట్ల ఆ మురుగునీరు బావుల్లోకి ప్రవేశిస్తున్నది. ముక్కుమూసుకొని తాగాల్సిందే తప్ప. మంచి మంచినీళ్లకు ముఖం వాచిపోయి వున్నాం మేము.

మహాప్రభో, ఈ బాధలు మేము పడలేము. ఎప్పుడు ఏ జబ్బు తగులు కుంటుందో తెలియదు. పిల్లల చేత నీళ్లు త్రాగించాలంటె భయంగా వుంది. ఇంకొక ప్రక్క పందుల బెడద. చింతారెడ్డి పాళెం

## చమత్కారం వృంపైన నష్టమేమిటి?

ఎమ్మెస్ రెడ్డి

# బూతుపై రస వత్తర సంవాదం!

ఇటీవలే విడుదలైన "..." చిత్రంలో ఒక ఛండాలమైన బూతు మాటను అక్షరాలు అటు ఇటు మార్చి ("ఒరేయ్! గుడ్డు మడిసి పోతావ్!") ఏదో చమత్కార పూరితమైన ప్రయోగంలా ఒక పాత్ర చేత చెప్పించారు. ఇంతకన్నా అన్యాయం మరేదైనా ఉందా? పైగా ఈ తరహా సంభాషణలకు ముఖ్యంగా మహిళా ప్రేక్షకులే ఆనందిస్తున్నారని కొందరు నిర్మాతల వాదన. అందుకే అటువంటి చిత్రాలే విజయవంతమవుతున్నాయని మరి కొందరు రుజువులు చూపడానికి సైతం ప్రయత్నిస్తున్నారు. కాలంతో పాటు కాలు ఆడించాలి. నలుగురితో పాటు నడవాలి" అన్న కుంటి సమర్థన వేరే!

మౌళి దర్శకత్వంలో నరేష్, శోభన నటించిన "హల్లో డార్లింగ్ లేచిపోదామా?" చిత్రం పేరులో 'లేచిపోదామా'కి సెన్సార్ కత్తెర పడింది. అది 'హల్లో డార్లింగ్' గా విడుదలవబోతుంది.

ఇటీవల మద్రాసులో జరిగిన "సీతారత్నం గారి అబ్బాయి" శత దినోత్సవ సభకు అధ్యక్షత వహించిన మల్లెమాల సుందర రామిరెడ్డి "ఒక చిత్రం విజయవంతమవడానికి కావలసిన సర్వహంగులూ ఉన్న ఈ చిత్రంలో ద్వంద్వార్థపు సంభాషణలు ఉన్నాయని విమర్శిస్తున్నారు కొందరు. సంభాషణలు సరసంగా – చమత్కార పూరితంగా ఉంటే కొంపలంటుక పోవు. ఇది కమర్షియల్ ఫీల్డ్ అనే విషయాన్ని దృష్టిలో ఉంచుకొని సెన్సార్ చేయాలని కోరుకుంటున్నాను" అన్నారు ముఖ్యఅతిథిగా విచ్చేసిన తిక్కవరపు సుబ్బరామిరెడ్డిని ఉద్దేశించి! "బూతు సంభాషణలు, అసభ్య సన్నివేశాలవల్లే చిత్రాలు విజయం సాధిస్తాయనే దురభిప్రాయం కొందరిలో ఉంది. ఈ ధోరణిలో నిర్మాతలు సినిమాలు తీస్తుంటే, ఇక సెన్సార్ బోర్డ్ ఎందుకు? అంటూ సుబ్బరామిరెడ్డి - కఠినతరం చేయబడిన సెన్సార్ నిబంధనలు మళ్ళీ గుర్తు చేశారు.

### రెండు పడవల మీద ప్రయాణం

ఎన్టీఆర్ ఓ వైపు 'తెలుగుదేశం' పార్టీ కార్యకలాపాలలో మునిగి తేలుతూనే మరో వైపు సినిమాలలో నటించకుండా ఉండలేక పోతున్నారు. బాపు దర్శకత్వంలో 'మహాకవి శ్రీనాథ' తో పాటు, కె. రాఘవేంద్ర రావు దర్శకత్వంలో మోహన్‌బాబు నిర్మించే సాంఘిక చిత్రంలో నటించడానికి నిశ్చయించారు. శుభం!

## ఇక సెన్సార్ బోర్డ్ ఎందుకు

సుబ్బరామ రెడ్డి

# బ్రతికున్న తండ్రిని చంపేసిన తార

అలనాటి నటి దేవిక, దర్శకుడు దేవదాసును వివాహమాడి, ఆ తర్వాత విడాకులు ఇచ్చేసింది. వీరి కూతురు కనక "వాలుజడ–తోలుబెల్టు" వగైరా తెలుగు, తమిళ చిత్రాలలో నటిస్తోంది. ఈ అమ్మాయి విదేశాలలో పర్యటించడానికి అవసరమైన పాస్‌పోర్ట్, వీసా దరఖాస్తు ఫారాలలో తండ్రిపేరు పేర్కొనవలసిన చోట "లేట్ దేవదాసు" అని పేర్కొందట. దేవదాసు సజీవంగా ఉన్న విషయం తెలిసిన ఓ ప్రభుత్వాధికారి అభ్యంతరం చెప్పి, "తండ్రి వేరయినంత మాత్రాన ఇలా పేర్కొనడం అన్యాయం. ఆ లేట్ అనేది కొట్టేసెయ్యండి" అని ఆమె చేతనే సవరింపజేశాడట!

### "బావలు ఉన్నారు జాగ్రత్త!"

"ప్రతి బావకి మరదలితో సరసమాడాలనే కోరిక ఉంటుంది. కాని, అది శృతి మించకూడదు – అనే సందేశాన్ని హాస్యరసంలో చెబుతున్నాం," అన్నారు రేలంగి నరసింహారావు. అహా! ఎంత మహత్తరమైన సందేశం!

ముహూర్తం పాటలో "అమ్మా కనకదుర్గమ్మ తల్లి! ఈ ప్రపంచంలో ఏ బావకి మరదళ్ళు లేకుండా చెయ్యి తల్లి!" అని హీరో రాజేంద్రప్రసాద్ అంటే, "అదేంటండి? అసలు మరదళ్ళు లేకపోతే బావలెలా అవుతారు?" అంది నాయిక శృతి. రాష్ట్ర మంత్రి రోశయ్య క్లాప్, డి.జి.పి. సి.ఎన్.రావ్ స్విచ్ ఆన్‌తో ప్రారంభోత్సవం జరిగింది. ఈ చిత్రంలో మొదట హీరోగా నరేష్‌ను బుక్ చేసుకున్నారు. ఏ కారణాలవల్లో అతను రాకపోయేసరికి హడావుడిగా రాజేంద్రప్రసాద్‌ను హీరోను చేశారు. దీనికి నిర్మాతలు: ఎస్. వెంకటేశ్వర రావు, జి. చందన్ రావ్.

### చందమామ విజయ కంబైన్స్

నాగిరెడ్డి, చక్రపాణి నిర్మించిన చిత్రాలు సభ్యత, సాంప్రదాయ బద్ధమైన ధోరణిలో అన్నివర్గాల ప్రేక్షకులనూ రంజింపజేసేవి అనడంలో అత్యుక్తి ఏమీ లేదు. అదే లక్ష్యంతో బి. వెంకటరామిరెడ్డి నిర్మిస్తున్న చిత్రంలో రాజేంద్రప్రసాద్, రమ్యకృష్ణ, సత్యనారాయణ, అంజలీదేవి, శుభలేఖ సుధాకర్, రాళ్లపల్లి, రావికొండలరావు, శ్రీలక్ష్మి, భాగ్యశ్రీ, రాధాకుమారి, గెస్టులుగా గుమ్మడి, రంగనాథ్ నటిస్తున్నారు. రచన: డి.వి. నరసరాజు, పాటలు: వెన్నెలకంటి, సంగీతం: మాధవపెద్ది సురేష్, సహదర్శకుడు: పూర్ణప్రజ్ఞ; నిర్మాణ సారథి: రావికొండల రావు.

### బోర్లపడుతున్న నిర్మాతలు

ఇతర భాషా చిత్రాలలో వెరైటీ ఉంటుందన్న నమ్మకంతో ఆ భాషా చిత్రాల హక్కులను కొన్న నిర్మాతలకు వెంటనే మన హీరోలు కాల్‌షీట్లు ఇస్తున్నారు. స్క్రిప్ట్ రెడీ మేడ్‌గా ఉన్నందువల్ల దర్శకులకు కూడా పని సులువే. "ఆసెంబ్లీరౌడీ" హిట్ అయినప్పట్నుంచి చాలా మందికి ఈ అలవాటు పట్టుకుంది. తమిళంలో షూటింగ్ ప్రారంభోత్సవం నాడే – తీసే కథ ఏమిటో తెలుసుకోకుండానే హక్కులు కొనడానికి పోటీ పడే నిర్మాతల గురించి ఏమనుకోవాలి? ఒక వేళ ఆతమిళ చిత్రం దురదృష్టవశాత్తు ఫ్లాప్ అయిందనుకోండి. ఇక ఈ నిర్మాతలది అధోగతే! అడ్వాన్స్‌గా చెల్లించిన లక్షల సంగతి మరచి, నెత్తిన గుడ్డ వేసుకుని, స్వగ్రామానికి మరలి వెళ్లవలసిందే. ఇలా చతికిలబడే నిర్మాతలకు సానుభూతి చూపే వారెవరు?

కొరవ 11 పేజిలో

### అరుపులు, కేకల మధ్య అసలు కథ మరుగున పడింది!

# మదరిండియా

చిత్రసమీక్ష

గ్రిద్దలూరు గోపాలరావు

నేల పుట్టినప్పటి నుంచి ఆ నేలను దున్నే రైతుకు అన్యాయం జరుగుతూనే వుంది. భూస్వాముల మూలంగానే కాదు, ప్రభుత్వంచేసే చట్టాల కారణంగా కూడా రైతుకు అన్యాయం జరుగుతూ వుంది. ఒకనాటి భూస్వామ్య వ్యవస్థను తొలగించేందుకు ప్రభుత్వం భూసంస్కరణల చట్టం చేసింది. కాని ఆ చట్టం రైతుల పాలిట శాపమైంది. భూస్వాములుగా వున్నవారు బినామీ పేర్లతో వారికున్న మిగులు భూమిని నిలుపుకొని, ధనస్వాములై కూర్చున్నారు. అంటే భూస్వామ్య వ్యవస్థపోయి ధనస్వామ్య వ్యవస్థ ఏర్పడిందన్నమాట.

భూ సంస్కరణల చట్టం ప్రకారం పరిమితి మీరకి భూమి మిగుల్చుకున్నరైతులు ఆర్థిక సమస్యలకు గురై నానాటికి దిగజారి సన్నగిల్లి పోతున్నారు; పట్టణాల్లోని వ్యాపారస్తులకు, పారిశ్రామిక వేత్తలకు వారి ఆస్తిపాస్తుల మీద లేని పరిమితి పల్లెల్లోని రైతులకు మాత్రం ఎందుకు అమలు పరచాలి.

భూమి తల్లిని (మదరిండియా) నమ్ముకొని బ్రతుకుతూ పట్టణ ప్రజలనూ బ్రతికించే రైతులను అన్ని విధాలా చిన్నచూపుచూడడం, పట్టణ వాసులను పెద్ద చూపు చూడడం చాలా అన్యాయం.

ఈ విషయాలన్నీ డి. దివాకరరావు నిర్మించిన "మదరిండియా" చిత్రంలో ప్రశ్నలుగా తలెత్తుతాయి.

రైతులకు, కూలీలకు మధ్యవున్నజీవన ప్రమాణాలతేడా చాలా తక్కువని, అందువల్ల వారిద్దరి మధ్య వర్గవిభేధాలు వుండకూడదని, ఈ రెండు వర్గాలూ కలసి కట్టుగా, ధన స్వామ్యవ్యవస్థపై కత్తి కట్టాలని బోధిస్తుంది చిత్రం. ఈ ప్రబోధంతో ధనిక స్వామ్యవవ్యస్థకు భూమి తల్లి దురవస్థకు మధ్య పోరాటం సాగుతుంది.

భూ సంస్కరణల చట్టం క్రింద నలిగి పోయిన రైతు కుటుంబీకురాలు రాజ్యలక్ష్మి(శారద) రైతులకు నాయకత్వం వహిస్తుంది. పాలేరు కొడుకు భీముడు

కొరవ 11 పేజిలో

## సణుగుడు

4 పేజీ కొరవ

తెలుసుకొని ఏమి జేస్తారు ! ఆయనకు మాత్రం రౌడీలు, కత్తులంటే భయమే కదా? రౌడీలతో, తన పెళ్ళాం పిల్లల జోలికి మీరు రాకుంటే మా జోలికి తమ కాళ్ళ రాకుండా కాపాడుతానని సంధి చేసుకొని వుంటారు.

ధన దోపిడీ సొత్తు మాదిరే, మానదోపిడీలోనూ తనకు వాటా చెల్లించాలనే షరతు కూడా సంధి ఒప్పందంలో వుందేమో విచారించావా?

మన పోలీసులు అంతటి ఘనులే!

అదిసరే – ఎమ్మెల్యే గారి కళ్ళనీళ్ల వల్ల రౌడీల చేతుల్లో మలినమైన ఆడపడుచుల మానాలు ప్రక్షాళన అవుతాయా?

కంట నీరు కార్చడం తోపాటు ఆ కాలనీలోని ఆడవాళ్లందరికీ తాను అండగా వుంటానని శపథం చేసి నిర్భయంగా ఎవరెవరు రౌడీల చేతిలో చెరచబడిందీ చెప్పమని ధైర్యం నూరిపోసిందట ఆమె.

ఎందుకు చెప్పడం – పత్రికలలో ఆ కథలు చిలువలు పలువలుగా ప్రచారమై; ఆ అభాగ్యినులు తలెత్తుకొని తిరగకుండా చేయడానికా? అయినా ఇంత జరిగితే, జరుగుతుంటే, ప్రభుత్వం ఏమి చేస్తున్నట్లు?

ప్రభుత్వానికంత తీరికెక్కడిది? కొత్తగా పదవుల్లోకి వచ్చిన వారి తల గొరిగించి, పాలిదండాలు పెట్టించే ఏర్పాట్లు చేయడానికే దానికి పాపం తీరిక చిక్కడం లేదు. ఎక్కడో ఎవరో ఆడపడచులు తమ శీలాన్ని కోల్పోతే పట్టించు కోవడం దానితరమా?

ఎమ్మెల్యేలు ఏమి చేస్తుంటారు? అసెంబ్లీలో అడగరా?

వారికి మాత్రం తీరికెక్కడది? సినిమాహాల్‌లో ఇద్దరు ఆడపిల్లలను ఒకేసారి చెరిచి తన మగసిరి ప్రదర్శించిన తమ్ముడిని అన్యాయంగా అరెస్ట్ చేయమంటున్న ప్రతిపక్షాలను దుమ్మెత్తి పోయడంలో ఒక ఎమ్మెల్యే నిమగ్నమై వున్నారు; కత్తిచూపి, తుపాకి పేల్చి అదే అమ్మాయిల్ని ప్రభుత్వ కార్యాలయానికి ఈడ్చు కెళ్లి, తాను అనుభవించడమే కాక, తన ఆటో డ్రైవరుకూ అవకాశమిచ్చి, ఉదారత చాటుకున్న సుపుత్రుడ్ని పోలీసులు కళ్లలో పడకుండా దాచిపెట్టడంలో మరొక మాజీ ఎమ్మెల్యే గారు బిజీగా వున్నారు; వీళ్లిట్లా తమతమ పనుల్లో తీరిక లేకుండా వున్నంత కాలం ప్రభుత్వం కూడా హాయిగా కాలక్షేపం చేసేస్తుంటుంది; అసెంబ్లీ పెట్టాల్సిన అగత్యం రాకుండా జాగ్రత్త పడుతుంటుంది!

పోలీసులు, రౌడీలు, రాజకీయ వాదులు ఎవరి మానాన వారు మన సోదరీమణుల మానాలు దోచుకుంటూ పోతూ వుంటే మన సంగతి?

మనమూ ఏడుకొండలెక్కి వెంకన్నకు మొరపెట్టుకుందాం- కాపాడమని !

వి.ఐ.పి.లకు దర్శనమిచ్చి, పూజలందుకోవడానికే ఆయనకు సమయం చాలడం లేదే. మన దీనాలాపన ఆయనైనా ఆలకిస్తాడా?

**

తిరుమల వెంకన్న అంటే గుర్తుకు వచ్చింది. ఈ మధ్య ఏదో కార్ల ర్యాలీ వెళ్లిందటవే కొండ పైకి!

ఒక ఫైనాన్స్ కార్పొరేషన్ ఓనర్, వంద కుటుంబాలను వెంకన్న సన్నిధికి చేర్చి, గుండు గొరిగించి తీసుక వచ్చాడట.

ఎవరివా కుటుంబాలు?

బహుశా ఆ కంపెనీలో డబ్బు దాచుకున్నవై వుంటవచ్చు.

మా డిపాజిట్ల సొమ్ము భద్రంగా కాపాడు దేముడా అని ప్రార్థించే అవకాశం వారికి కల్పించాడన్నమాట.

అంతే అయి వుండాలి; పుట్ట గొడుగుల్లాగా పుట్టుక వస్తున్న ఫైనాన్స్ కంపెనీలు, చిట్‌ఫండ్ కంపెనీలు, సప్తగిరి బాపతు సంస్థల నుంచి ప్రజలను కాపాడాల్సింది ఆ దేముడే కదా!

అయినా, భగవంతుడిని ప్రార్థించడానికి ఇంత ఆర్భాటం చేయాలా?

ఇది వ్యాపార ప్రపంచం; వ్యాపారానికి ప్రచారం కావాలి; ప్రచారానికి పనికిరాని సందర్భమంటూ వుండదు. తల్లి ప్రేమను, భగవంతుడిపై భక్తిని కూడా అమ్మకానికి పెట్టగల తెలివిగలవాడే వ్యాపారంలో రాణింపుకు వస్తాడు.

మేము దేముడిని పూజించడానికి వెళ్తున్నామహో అని టాంటాం వేసుకోవడం భక్తి అవుతుందా?

దేముడిపై భక్తి ఎవడికి కావాలి; పత్రికలలో ప్రకటనలు చూడలేదా- అందులో దేముడి బొమ్మ ఎక్కడైనా కన్పడిందా? కంపెనీకి కావలసింది ప్రచారం; ఆ ప్రచారం ద్వారా డబ్బు రావాలి! తక్కిన సంగతులు అప్రస్తుతం!

***

మునిసిపల్ ఇళ్ల పన్నుల ఘోరం విన్నావా?

పిచ్చి పన్ను ఎప్పి తప్పు. ఇంటి పన్ను బాధ నాకు తెలియదు; నాకు ఇల్లుంటే కదా?

ఊర్లో గగ్గోలూ వినలేదా!

ఔరంగజేబు జుట్టు పన్ను మాదిరి, నెల్లూరు ఇంటిపన్నులనూ చరిత్ర పుస్తకాలలో చిరస్థాయిగా నిలపాలని ఆ మునిసిపల్ అధికారులు యత్నిస్తుంటే, జనం గగ్గోలు పెట్టడం అన్యాయం కాదూ!

కొందరికి అన్యాయం జరగ కుంటే, కొందరికి న్యాయం జరగదనే సంగతి నీకు తెలియదా?

మళ్లీ ఈ మెలికేమిటి?

తమను ముందుగా కలిసి ప్రసన్నులను చేసిన వారిని సంతృప్తి పరచడం అధికారుల విధి; వారిపై పన్నుల భారం పడకుండా చూడడం వారి కర్తవ్యం ; అందరికీ పన్నులు తగ్గితే మునిసిపాలిటీకి ఆదాయం పెరిగేదెట్లా? అందరికీ పన్నులు పెరిగితే తమ స్వంత ఆర్జన హెచ్చేదెట్లా ? ఎక్కడో తగ్గించిన మొత్తాలు, ఇంకెక్కడో పెంచిసర్దితే తప్ప బ్యాలెన్స్‌షీట్ ట్యాలీ కాదు.

నాకేమీ అర్థం కావడం లేదీ భాష.

ఇంతకంటే విడమరిచి చెబితే చాలా మంది నిష్ఠూరాలు పడతారు. అయినా చెప్తా విను. నీకు సినిమా హాలుందనుకో; అన్నివేల చదరపు టడుగుల విస్తీర్ణానికి పన్ను వేస్తే లక్ష దాటుతుంది. ఆ లక్షను సగమో, ముప్పాతికో చేసి అధికారుల కివ్వామనుకో – అది కాస్తా ఆరువేలౌతుంది! ఒక్కసారి 50వేలు పోయినా, మూడేళ్లు ఆరు వేల లెక్కన పన్ను కడితే రెండు లక్షలా 88 వేలు లాభం.

నా రెండు పోర్షన్ల ఇరుకింటికే ఎనిమిది వేలు వేశారు – సినిమా హాల్‌కు ఆరు వేలు వేసి, ఇరుక్కొనేంత పిచ్చివాళ్లా మునిసిపల్ నేతలు ?

పిచ్చివాడా – అక్కడే వుంది రహస్యమంతా. చేతికి మట్టి కాకుండా విలువ లోతు గోతులు త్రవ్వడంలో అధికారులను మించిన వారు లేరు. సినిమా హాల్ పైకప్పు పైన సిమెంట్ రేకులుంటాయి; అదున్న ప్రాంతం అతి తక్కువ పన్నుల జోన్ అవుతుంది; ఇక ఏ చట్టం ఆ అధికారిని ఏమి చేస్తుంది చెప్పు!

అది విను ; మా ప్రక్కింటాయనకు నాలుగంతస్తుల భవంతి వుంది; కాని పన్ను మాత్రం రెండు వేలేనట; నాకు మాత్రం ఎనిమిది వేలు; ఏమిటీ మాయ?

మునిసిపలాఫీసుకు దారెటో నీకు తెలియదు; మునిసిపలాఫీసు మొత్తం ఆ ప్రక్కింటాయనకు, ఆయనింటి కొచ్చి మరీ దాస్యం చేస్తుంటుంది. కావాలంటే రికార్డులు చూడు – నాలుగంతస్తుల భవంతి కాస్తా, నాలుగు గదుల ఇల్లుగా నమోదై వుంటుంది!

మరీ అంత అన్యాయమా?

అన్యాయం, న్యాయం అనేదానికి ఇక్కడ అర్థాలువేరు. చట్టం ప్రకారం నాలుగంతస్తుల ఇల్లు కట్టడానికి లేదు; దానికి ప్లాన్ అప్రూవ్ కాదు. అందువల్ల కట్టేటప్పుడు రెండంతస్తులు మాత్రమే వున్నట్లు చూపుతారు. తక్కిన రెండంతస్తులూ కట్టనే కట్టనట్లు రికార్డులకెక్కడానికి సంబంధితులకు నజరానాలు చెల్లింపబడతాయి. ఇప్పుడు పన్ను కోసం మొత్తం ఇంటిని కొలత వేస్తే అప్పటి తప్పులు బయట పడతాయి. అనవసరంగా తోటి సిబ్బంది ఇరుక్కుంటారు. అందువల్ల ఎప్పటికీ మునిసిపల్ లెక్క మారదు. నువ్వెన్ని చెప్పినా ఆ భవంతికుండేది రెండంతస్తులే. ఆ లెక్క మారనంత కాలం పన్ను పెరగదు.

ఎప్పుడైనా ఎవరో ఒక నిజాయితీ పరుడైన అధికారి వస్తే ఈ నిజాలన్నీ వెలికి రావా?

పిచ్చివాడా! నువ్వడిగే అధికారి రావాలంటే, కాలం కనీసం పాతికేళ్లు వెనక్కు నడవాలి. ఇప్పుడు లంచం రేటు పెంచడానికి ప్రయోగించే సాధారణ ట్రిక్కు – నిజాయితీ !వచ్చి రాగానే నిజాయితీ పరుడి మాదిరి ఫోజు కొట్టి, దడబడలు చేస్తే, మామూలు పర్సంటేజీకి మరి కొంత పెరుగుతుంది. లంచం ఇచ్చేవాడు భయం భయంగా, బేరం చేయకుండా ఇచ్చేసి పోతాడు.

ఇన్ని మోసాలు, వలలు, వలయాల మధ్య చిక్కుక పోతున్న సగటు పౌరుడ్ని రక్షించే దెవరు?

ఇంకెవరు? గడ్డిపోచలుగా గాలికి ఎగిరిపోయే తత్వం మానుకొని, గడ్డి ఎంటుగా పెనవేసు కోగల్గితే సగటు మానవుడికి, సగటు మానవుడే రక్షకుడౌతాడు!

## సారాయి

(2 పేజీ కొరవ)

మహాత్మాగాంధీ ప్రేరణతో ఆనాటి కాంగ్రెస్ ప్రభుత్వాలు మద్యపాన నిషేధం అమలు పరచ ప్రయత్నించక పోలేదు. కాని, అది ఆచరణలో విఫలమైంది. రాజాజీ వంటి మహిమాన్వితుడే దాన్ని సఫలం చేయలేకపోయారు. ఒక్క గుజరాత్‌లో మాత్రమే అది కొద్దో గొప్పో సఫలమైంది. సారాయిని మాన్పించడానికి ప్రభుత్వం నిర్బంధాలు విధించే కొద్దీ, మరింత ఉధృతంగా ఆ వ్యసనం ప్రజలను బానిసలుగా మార్చింది. కల్తీ సారా వరదలై పారింది. అవినీతి వెల్లువై పొంగింది. స్వాతంత్ర్యానంతర తొలితరం కాంగ్రెస్ నాయకులు కూడా, ఎంతో చిత్తశుద్ధి వున్నవారు కూడా విసుగుచెంది, వదిలి వేసే పరిస్థితి కల్గింది

నిషేధాలు, నిర్బంధాల ద్వారా త్రాగుడు మాన్పించ చూడడం తప్పు. ఆ దుర్వ్యసనం పట్ల ప్రజలలో అవగాహన పెంచడానికి, దాన్ని వ్యతిరేకించాలనే సామాజిక వాతావరణం సృష్టించడానికి ప్రయత్నం జరగక పోవడమే ఆ వైఫల్యానికి కారణమేమో!

అక్షరాస్యతా ఉద్యమం వల్ల, మన జిల్లా వరకు అటువంటి సామాజిక చైతన్యం కల్గింది; ఇప్పటి వరకు ఇందులో ఏ రాజకీయ ప్రమేయమూ లేదు. ఉద్యమమూ సంఘటితంగా లేదు. ఒక అద్భుతమైన వాతావరణం ఏర్పడి వుందిప్పుడు; దీన్ని వాడుకోవడం. ఉద్యమాన్ని వ్యవస్థీకృతం చేయడం అవసరం. ఆవేశంతో ఉద్యమం నడిపిస్తే, ఎక్కువ కాలం నిలవదు. ఏ ప్రతిబంధకంతోనో ఒక చోట దెబ్బ తింటే మొత్తం పతనమౌతుంది; నిరుత్సాహం కల్గుతుంది. అటువంటి ప్రతికూలతలు ఏర్పడక ముందే ఉద్యమ ఫలం సిద్ధింప జేయడానికి, సారాయిని గ్రామాల నుంచి శాశ్వతంగా తరిమి వేయడానికి ప్రయత్నం మొదలు కావాలి!

అయితే దీని ఫలితంగా ఈసారి వేలం పాడిన సారాయి కాంట్రాక్టర్లు పెద్ద ఎత్తున నష్టపోతున్నారు. ఒక్క నెల్లూరు సర్కిల్ కాంట్రాక్టరు నెలకు 75లక్షల కిస్తీ వంతున వేలం పాడి వున్నారు. వేలం షరతుల ప్రకారం - వీరు 3 నెలల కిస్తీ మొత్తాన్ని డబ్బుగా కాని, బ్యాంకు గ్యారంటీ రూపంలో కాని ప్రభుత్వానికి అడ్వాన్సుగా చెల్లిస్తారు. సారాయి సంవత్సరం ముగిసేది అక్టోబరులో. అంటే, ఆగస్ట్, సెప్టెంబరు, అక్టోబరు నెలల మొత్తాలు ముందుగానే ప్రభుత్వానికి చెల్లించి వేసి వుంటారన్నమాట. ఇప్పుడు సారాయి ఉద్యమం జరిగి, అమ్మకాలు నిల్చిపోతే, కాంట్రాక్టరు ఈ3 నెలలు కిస్తీ నష్టపోతాడు. జిల్లా మొత్తం మీద నెలవారీ కిస్తీ మొత్తం రెండు కోట్ల 40 లక్షలు. ఆరేడు కోట్లు కళ్ల ముందు చేజారి పోతుంటే కాంట్రాక్టర్లు చూస్తూ ఊరుకోలేరు. ఏదో ఒక ప్రయత్నం చేసి అమ్మకాలు జరిపించడానికి ప్రయత్నిస్తారు. అది వారి అవసరం. దానివల్ల బలహీనంగా వున్న చోట ఉద్యమం పతనమౌతుంది. దాని ప్రభావం తక్కిన గ్రామాలకూ ప్రాకుతుంది.

కాంట్రాక్టరు నష్టపోవాలని ఎవరూ చెప్పరు; కాని కాంట్రాక్టర్ల కోసం ఒక మంచి ప్రయత్నం నిర్వీర్యం కావడం విచారకరం. ప్రభుత్వం ఉదార బుద్ధితో, ఉదాత్త వైఖరితో నెల్లూరు జిల్లా వరకు కంట్రాక్టర్లకు వారి కిస్తీ డబ్బు వాపసు చేసి, సారాయి అమ్మకాలను తనంత తానుగా నిలిపితే ఉద్యమ ఫలితం కనీసం కొన్ని ప్రాంతాలలోనైనా శాశ్వతీకరింప బడుతుంది; పేదల సంసారాలు చక్కబడతాయి.

## సింహపురి

(4 పేజీ తరువాయి)

ప్రహరాంధ్రమకు శ్రీ కురుగంటి నాగిరెడ్డి ఈ స్కూలు భవన నిర్మాణం కోసం రెండు లక్షల భూరి విరాళం ఇచ్చారు. ఇందుకు గాను ఆ హైస్కూలు కు ఆయన పేరును పెట్టవలసిందిగా ఆదేశాలు వచ్చాయి. తన నియోజక వర్గంలో క్రొత్తగా అభివృద్ధి చెందుతున్న పట్టణ ప్రాంతంలో హైస్కూలు అవసరాన్ని గుర్తించి, ఉదారంగా రెండు లక్షల రూపాయలనిచ్చి విద్యాదానం చేసిన శ్రీ కురుగంటి నాగిరెడ్డికి ఎమ్మెల్యే శ్రీ సి.వి. శేషారెడ్డి తన కృతజ్ఞతను తెలియ జేశారు. పాఠశాల తర పున. భక్తవత్సల నగర్ ప్రజల తరపున ప్రధానో పాధ్యాయుడు శ్రీ కె. సుబ్బారావు కూడా శ్రీ నాగిరెడ్డికి కృతజ్ఞతను తెలిపారు.

### తోటి పనివారికి పునరావాసం

తర తరాలుగా తోటపని తదితర అపరిశుభ్రమైన వృత్తుల ఆధారంగా బ్రతుకుతున్న కుటుంబాలకు ప్రభుత్వం నూతన ఉపాధి కార్యక్రమాలు తల పెట్టింది. వారి పునరావాస, కార్యక్రమం జూలై 27 వ తేదిన పెద్యాల్లు కులాల సేవా సహకార సంఘం కార్యాలయంలో జిల్లా రెవిన్యూ అధికారి శ్రీ సి.హెచ్. సత్యనారాయణ అధ్యక్షతన జరిగింది.

నెల్లూరు జిల్లాలో తోటిపని చేసే కుటుంబాలు 247 వున్నాయి. ఆ కుటుంబాలలో మరే ఉపాధీ లేకుండా కేవలం తోటి పనిపై ఆధారపడి జీవించే కుటుంబాలే నలభైమూడు ఉన్నాయి. ఈ కుటుంబాలకు ఒక్కొక్క దానికి యాభైవేల రూపాయల ఆర్థిక సహాయం పెద్యాల్లు కులాల సేవా సహకార సంఘం ద్వారా ఇవ్వ బడుతుంది. లబ్ధి దారులకు లాగుడు బండ్లు, జనతా హోటల్, బంకులు, సైకిల్ షాపులు, కిరాణా కొట్లు, బైరుబండ్లు, వంటివి ఇవ్వడం జరుగుతుంది. తాముగా ఎన్నిక చేసుకున్న యూనిట్‌ను ఏర్పాటు చేయడం జరుగుతుంది.

తోటి పనివారికి జూలై 27,28 తేదిలలో శిక్షణా కార్యక్రమం, వైద్య పరీక్షలూ జరిగాయి.

వీరికిచ్చే రుణంలో 10వేలు సబ్సిడీ, మంజూరైన మొత్తంలో 20శాతం మార్జిన్, 30 శాతం కేంద్ర సహాయం ఉంటుందని ఎస్.సి. కార్పొరేషన్ అధికారులు తెలియ జేశారు.

### అంధ బాలికలకు విద్యావకాశం

వికలాంగుల సంక్షేమ శాఖ ఆధ్వర్యంలో విశాఖ పట్టణంలో 1987 సంవత్సరం నుండి ఒక అంధ బాలికల ఆశ్రమ పాఠశాల నడుస్తోంది. ప్రతి ఏడాదీ జూన్ నుండి ఆగస్టు వరకు 6నుండి 8సంవత్సరాల వయసు గల వారిని చేర్చుకుంటారు. ప్రతి విద్యార్థికి విద్య, భోజనం, దుస్తులు, పఠక పాఠ్యపుస్తకాలు ఉచితంగా లభిస్తాయి. వృత్తి విద్యలలోనూ శిక్షణ ఇస్తారు. అనుభవజ్ఞులైన కంటి డాక్టర్ల ద్వారా ఎప్పటి కప్పుడు పరీక్ష చేయించి, చూపు వచ్చే అవకాశం ఉన్నవారికి శస్త్ర చికిత్స చేయిస్తారు. స్కూలుకు పిల్లలను తీసుక వెళ్లేందుకు ఒక సహాయకుడికి ఆర్‌టిసి, రైళ్లలో ఛార్జీల రాయితీ వుంటుంది. బ్రెయిలీ టైప్ రైటింగ్‌లోనూ శిక్షణ ఇస్తారు.

అంధ బాలబాలికలు ఈ సదవకాశాన్ని వినియోగించు కునేందుకు అసిస్టెంటు డైరెక్టరు, వికలాంగుల సంక్షేమ శాఖ, నెల్లూరు వారిని విచారిస్తే, వివరాలు తెలుస్తాయి.

### ద్విశతాబ్దికి 'స్పందన'-కవి సమ్మేళనం

నెల్లూరు జిల్లా ద్విశతాబ్ది వేడుకల్ని పురస్కరించుకొని స్పందన సాహితీ సమాఖ్య "నెల్లూరు ప్రస్తుతి "పేరుతో ఒక కవి సమ్మేళనాన్ని నిర్వహిస్తున్నది. పాల్గొన దలచిన కవులు నెల్లూరు జిల్లా గత ప్రాభవాన్ని గుర్తు చేసే కవితలను, గీతాలను ఆగస్టు నెలాఖరులోగా - సి.నారాయణ రావు, కార్యదర్శి, స్పందన, 4/591 ఉస్మాన్ సాహెబ్‌పేట, నెల్లూరుకు పంపండి.

### ఆర్ఎల్‌రెడ్డి 79వ జయంతి

ఆవుల సాంబశివరావు గారి అధ్యక్షతన, డాక్టర్ బెజవాడ గోపాలరెడ్డి గారు ముఖ్య అతిథిగా, స్వర్గీయ రేబాల లక్ష్మీనరసారెడ్డి డెబ్బయ్ తొమ్మిదవ జయంతి ఉత్సవం ఆగస్టు నాలుగవ తేది టౌన్‌హాల్‌లో జరుగుతుంది. సభలో ఆచార్య జి.వి. సుబ్రహ్మణ్యం ఉపన్యసిస్తారు. డాక్టర్ గోపాల రెడ్డి గారికి సన్మానం జరుగుతుంది.

## వేమన

(4 పేజీ తరువాయి)

గదా" అని ధైర్యంగానే చాటు కున్నారు.

వేమన ను "మహాకవి" అని ఎందుకంటున్నారంటే అద్దముంది "ముఖముంది" అన్నట్లు అనాటి సమాజ వాస్తవ చిత్రణను అద్దంలో ప్రతిబింబంగానే చెప్పారు. వ్యాధిగుట్టు, సంసారం రట్టు" అన్నారు. ఇంత పచ్చిగా పదజాలాన్ని గుప్పించి ఎందుకు వ్రాశాడు? మరమ్మత్తు చేయవలసిన వస్తువు యొక్క స్వరూప స్వభావాలు ముందుగా బోధించడం సరియైన పద్ధతిగాబట్టి అట్లా వ్రాశాడు. ప్రజల నాడిని పట్టుకోవడానికి, అంతరాత్మను తాకి పలకరించడానికి అచ్చతెనుగు ప్రజల భాషనే ఆయన కవిత్వానికి సాధనంగా తీసుకున్నాడు. అయితే మహా కవి ఇంతవ్రాసినా సమాజంలో నేటికైనా ఏమైనా మార్పువచ్చిందా అంటే రాలేదని సమాధానమే వస్తుంది. దీనిని బట్టి సమాజాన్ని మార్చడానికి సాహిత్యం ఒక్కటే సరిపోదు. సాహిత్యం చదవడం ద్వారా సమాజ పరివర్తన సుసాధ్యమే అయితే వేమన కాలంలో కొంతకు కొంత సంస్కరింపబడి, దేశంలో నైతిక విలువలు పెరిగి ఉండేవి. అయితే ఏమిటి సాధనం? మహాకవి చెప్పనే చెప్ప పోయాడు.

"రొమ్ము తెగులుచేత దూలిన పసరంబు
వాతవేయబతికి వచ్చెనేని
వాత యినుముపాలు రోతన వచ్చునా."

ఒక విధమైన నియంతృత్వంలో సంస్కరింప బడిన సమాజం నుండే సత్ఫలితాలు పొందవచ్చుననేది మహాకవి వివరణ.

వేమన కోరినదీ, ఆయన చెప్పలేనిదీ ఒకటుంది. అదే "శాస్త్రీయ దృక్పథం" కవి కాలం నాటికి 'మార్క్సిజం' ఎక్కడో సుదూర భవిష్యత్తులో, 350సం.ల తర్వాత గాని లేదు.

సమాజంలోని అసమానతలకు, దుర్మతలకూ కారణాలు అన్వేషించడానికి సాధ్యంకానప్పుడు ఓంకారాన్ని పంచాక్షరిని, గాయత్రిని జపించమన్నారు. వీరబ్రహ్మంగారి బరు వగ్రాల ప్రబోధం కూడా ప్రస్తావించడం జరిగింది. అగమ్యగోచరమైన స్థితిలో ఏదేదో చెప్పారు. ఆ చెప్పినదంతా విశ్వాలో పాసనను దెబ్బతీసేదిగా లేదు. అలాగే మూఢ విశ్వాసాలనూ ప్రోత్సహించలేదు.

"తిరుమలలోపుకుక్క తిరిగి సింహము
గాదు
కాశిబోవు పంది గజముగాదు
పర్వత మోవులంజ పతివ్రత గాదురా."

"రాతి బొమ్మలకేల రంగైన వలువలు
గుళ్లు గోపురములు కుంభములును
కూడు గుడ్డ తాను గోరునా దేవుండు."

అన్నారు యుగపురుషుడు మహాకవి వేమన యొక్క యుగం అంతరించి 400సం.లు కావస్తున్నది. ఆయన సాహిత్యం మాత్రం సజీవంగా నిలిచి ఉంది. ఇహ ఎన్ని యుగాలకైనా ఉంటుంది.

వేమన కాలంలో సమాజంలోని ప్రజలనుభవించిన బాధల బాటల పల్లవిని గురించి చెప్పకుంటూ పోతే ఒక పెద్ద గ్రంథమే అవుతుంది. ఆ రోజుల్లో స్త్రీ దాదాపు, కాదు పూర్తిగానే విలాసవస్తువుగా ఉన్నది. దోపిడీ దొంగల బాధ ఈనాడు న్నట్టే ఆనాడూ ఉండేది. మోసగాళ్ళు, ఇదేమి అన్యాయం అని అడిగితే పైబడి తన్నిపోయే వాళ్లూ ఉండేవారు. పేదరైతులు అతి భయంకరంగా ప్రాణాలు అరచేత బట్టుకొని కాలం గడుపుతూ ఉన్నారనేందుకు వేమన సాహిత్యంలో సాక్ష్యాలు ఉన్నాయి. చేతి వృత్తుల వాళ్లు సమాజం దృష్టిలో హీనంగా చూడబడు తుండేవారు. స్త్రీలంటే వేమనకు అంత అసహ్యమే కాదు, ఆగ్రహంకూడా ఉంది. అయితే ఒక సందర్భంలో మాత్రం స్త్రీల మీద సానుభూతి చూపించారు. వధువుకు వరుణ్ణి చూడటంలో పాటించాల్సిన జాగ్రత్తలు మాత్రం మహాకవి చెప్పిపోయారు.

"కలిమి జూచి, యివ్వ
క్రయమిచ్చినట్లుండు
సమునకివ్వ మంచి సరసగుణము
పేదకివ్వ మనువు పెనవేసి నట్లుండు,"

"విద్యలేక యున్న విత్తము లేకున్న
మూఢుడైన దుదకు ముగియైన
యిష్ట బంధువునకు నీదైన నీవచ్చు."

"కల్గువారు లేమివాని కిచ్చు మనువు
కలిమి లేముల నటు గలసి యుండు
యేటికలిమి జూడ నెక్కడ లేమిరా."

## చిత్రసమీక్ష

(9 పేజీ తరువాయి)

(పరుమారి గోపాలకృష్ణ) రైతుకూలీలకు నాయకుడుగా వ్యవహరిస్తాడు. ధన స్వామ్యవ్యవస్థ ప్రతినిధులుగా రావు (చలపతిరావు) నిలబడతాడు. రైతులకి, ధనస్వాములకు; రైతులకు, రైతు కూలీ లకు మధ్య తలెత్తె సమస్యలు జరిగే తగాదాలు, వాటి పై పోరాటాలు, వాటి పరిష్కారాలు చూపబడ్డాయి.

సామాజిక పరమైన ఈకథను ఒక కుటుంబ కథతో ముడిపెట్టారు. భూ పరిమితి చట్టంలో తన అన్నచేతిలో మోసపోయిన రాజ్యలక్ష్మి బాగానష్ట పోతుంది. ఆమె ఇద్దరి కొడుకులుఆమెతో సిద్ధం చేస్తుంటారు. ధనస్వామ్య వ్యవస్థపై తిరగ బడతారు. పెద్దకొడుకు తల్లి కష్టంతో చదివి కలెక్టరవుతాడు. (సాయికుమార్) ధన వంతుల తొత్తుగా తయారవుతాడు. చివరకు తల్లి వైపే వారుతాడు.

ఇతి వృత్తం చాలా పాతది. దీన్ని చూపిన విధానంలో దర్శకుడు బి. రమణారెడ్డి కొత్తదనం కనపరచ లేక పోయాడు. కుటుంబ కథకు సంబంధించిన సన్నివేశాలు బాగున్నాయి. కాని పోరాటం పరంగా కత్తులు, కటారులు, మంది మార్బలం, అరుపులు, ఉ... యిత్యాలు, తప్ప సంఘటనల్లో పట్టు కనపడలేదు. మానవతను వేధించే రాక్షసత్వం, ధనస్వామ్య దోషం, అధికారదర్పం, రాజకీయ రౌడీయిజం ఆకట్టుకోలేక పోయాయి. సాగదీయ బడ్డ బ్రహ్మానందం, సుధాకర్ ల హాస్య ధోరణిలో ఇవన్నీ చప్పగా తేలిపోయాయి. వీరి హాస్యం అనవసరంగా చిత్రం నిడివిని పెంచింది. కలెక్టరు ప్రతి చిన్న విచారణకు గ్రామానికి పరుగెత్తు కొని రావటం సబబుగా లేదు.

పరుమారి బ్రదర్స్ మాటలు కొన్ని సన్నివేశాల్లో బాగున్నాయి. జాలాది వ్రాసిన "నాగలితో ఈనాలుగు దిక్కుల ఆకలి తీర్చే శ్రామికులు" పాట బాల సుబ్రహ్మణ్యం కంఠంతో ఖంగు మంది.

శారద చక్కగా నటించింది. చలపతిరావు, కోట పేరు పడ్డ విలన్లు కదా! ఆ పేరు నిలబెట్టుకున్నారు. జగపతి బాబు హుషారుగా నటించాడు. సింధుజ చిలిపిగా రాణించింది. పరుమారి గోపాల కృష్ణ నటించకుండా మాటలు వ్రాసుకుంటే బాగుంటుంది. ఈ తెలుగు చిత్రం పేరులో తెలుగుదనం లోపించింది. ఇంగ్లీషు పేరు పెట్టడంవల్ల ఒరిగిందేమిటో అర్థమే కాదు.

## సినిమా

(9 పేజీ తరువాయి)

### సినిమా తారకు ఆలయ మర్యాద

ఏడుకొండల స్వామి సన్నిధిలో ప్రముఖ రాజకీయవేత్తలకు, నాయకులకు ఆలయ మర్యాదలు లభించడం అనాదిగా వస్తున్న ఆచారమే. ప్రతి రోజూ తిరుపతికి ఎందరో విద్యాధికులు, శాస్త్రవేత్తలు, ఘనాపాటీలు, వైద్య నిపుణులు వస్తూంటారు. వీళ్ళు సామాన్య భక్తులలాగే 'క్యూ' లో నే నిల్చుని స్వామి దర్శనం చేసుకుని తరిస్తూంటారు. కాని, జూలై 24 న ఒక సినిమా తారకు ఘనంగా లభించిన ఆలయ మర్యాదకు ఆలయ ప్రాంగణంలోని యాత్రికులు విస్తుపోయారు. వేకువఝామున 3గంటల నుంచి 6 గంటల వరకు స్వామికి తోమాల సేవ, అర్చన చేయించిన అలనాటి నటి బి. సరోజాదేవికి దేవస్థానం అధికారులు స్పెషల్ ఏర్పాటుచేయడంతో పాటు లడ్డు, వడ, శ్రీ పాదరేణు ప్రసాదం అందజేసి ధన్యులయ్యారు.

### వాణిశ్రీ నటించే "ప్రేమే నా ప్రాణం"

నిర్మించాలన్న ఆదర్శవంతమైన చిత్రం తలంపుతో "రగులుతున్న భారతం" చిత్రానికి దర్శకత్వం వహించి అపజయం పొందిన అల్లాణి శ్రీధర్ ప్రేక్షకుల అభిరుచి మేరకే చిత్రాలను రూపొందించాలన్న నిర్ణయానికి రాక తప్పలేదు. వారి నిర్ణయానికి వాణిశ్రీ ఆదరువు అయింది. "ప్రేమే నా ప్రాణం" చిత్రంలో తన కొడుకు ప్రేమను ఒక ప్రయోజనార్థం ఆయుధంగా మలచుకునే డైనమిక్ కారెక్టర్ ఆమెది. వరుణ్‌రాజ్, నాజర్, లక్ష్మి ప్రియాంక అనే నవనటి, మధుప్రియ, శ్రీ లక్ష్మి, మురళీమోహన్, చక్రవర్తి, వేలు, బ్రహ్మానందం, బాబా మోహన్, మాగుంట సుధాకర్ ఇతర పాత్రధారులు. కథ: కొమ్మనాపల్లి శ్రీధర్; మాటలు: కొమ్మనాపల్లి గణపతిరావు; గీతాలు: వేటూరి, భువనచంద్ర, సాహితి, దేవిప్రియ; సంగీతం: కీరవాణి; సమర్పణ: దువ్వాసి శంకరయ్య; ఛాయ: మధు మహంకాళి;

---

### విజయవాడ 2వ అదనపు సబార్డినేట్ జడ్జివారి కోర్టులో

O.S 213/86

Between State Bank of India, Kanchikacherla -వాది

And

7. Kalava Nageswara Rao S/o. Seetharamayya Kanchikacherala Krishna Dt

9. Thota Radhakumari W/o. Prasad Lecturer, Govt Polytechnic College Guduru, Chitturu Dt. - ప్రతివాదులు

పై నెంబరు దావాలో 7 వ మరియు 9వ ప్రతివాదుల హాజరు నిమిత్తం శ్రీకోర్టువారు 28-8-92 వ తేదికి వాయిదా వేసినారు. సదరు ప్రతివాదులు స్వయంగాగాని, Advocate ద్వారా గాని సదరు తేదిన ఉదయం10.00 లకు పై కోర్టులో హాజరై ఆక్షేపణలు తెలుపు కోవలెను. లేని ఎడల పరోక్షమున తీర్మానించబడును.

దోర్నల రాధాకృష్ణమూర్తి
వాది అడ్వకేటు
54-14/7-2 భారతి నగర్
విజయవాడ.- 520 008 16-7-92

---

### గుంటూరు అ.స. కోర్టులో

O.S. 122/72 E A 27/90

1.M.L. సుబ్బయ్య శెట్టి ( Died), 2.K.నక్కు బాయమ్మ 3.M. చంద్ర శేఖరరావు 4.M.పార్థసారధిబాబు 5.P. లీలావతి 6.P.కృష్ణకుమారి 7.K. శాయిలీల 8.K.సరోజినీ దేవి 9.A.N. V.L. సీతారామమ్మ being minor by N.7 గార్డియన్ తల్లి M.శాయికృష్ణ 10. A.N. V.L.సీతారామమ్మ ష్ణ 2 to 5, 8 and 9 సా. హైదరాబాదు. 6 and 7 సా. గుంటూరు

Dhrs.

యెదిరి

L.నూరు మహమ్మద్ ఖాన్ S/o. L. మహబూబ్ ఖాన్, Mine Owner డోన్, కర్నూల్ జిల్లా.

Jdrs

యీ నెంబరులోని JDR కు ఎన్నిసార్లు నోసులు పంపినను తీసుకోనందున JDRకు జారీకావలసిన నోటీసును Substitute Service ద్వారా జారీకాగలందులకు 11-9-92తేది కి వాయిదా వేసినారు. కనుక మీ ఆక్షేపణలను పై కోర్టువారి ఎదుట హాజరై తెలియ పరుచుకోవలెను. లేనిచో మీ పరోక్షమందు తీర్మానించ బడునని యిందు మూలముగా తెలియ జేయడమైనది.

B.V.S.S. ప్రసాద్
డిటీసన్లర్ల తరపు అడ్వకేటు
C/o, సి. వెంకట్రామయ్య, అడ్వొకేట్
5-21-180, 2/8, బ్రాడీపేట,
గుంటూరు

## జిల్లావార్తలు

(5 పేజీ కొరవ )

### పూడిపర్తి మంచి నీళ్ల కటకట

వెంకటాచలం మండలం పూడిపర్తి గ్రామస్తులు మంచినీళ్లకు అల్లాడిపోతున్నారు. ఆ గ్రామానికి ఎప్పుడు నీటి కరువే. ఊర్లో మంచినీటి బావి లేదు. ఎన్నో ఏళ్ల పోరాటం తర్వాత, ఊరికి మైలు దూరంలో ఓవర్ హెడ్ ట్యాంక్ కట్టి, కొళాయిలు వేశారు. ఈ మధ్య ఆ ట్యాంకు మోటారు కాలి పోయిందట. రిపేరుకు పనికి రాలేదు. కొత్త మోటారు కొనేందుకు పంచాయితీలో డబ్బులేదు. మంచినీళ్లకు వారు పడే బాధ అంతింతా కాదు. అప్పటికే ఎమ్మెల్యే శ్రీ సి.వి. శేషారెడ్డికి గోడు విన్నించారు. ఆయన నిధుల కోసం డిడిఒను అభ్యర్థించారు. ఆ విజ్ఞప్తి విజ్ఞప్తిగానే వుండి పోయింది.

సతీష్ - చంద్రగారూ - కనికరించండి; పూడిపర్తి గ్రామస్తుల దాహం తీర్చండి!

### కావలి స్కూల్ కాంప్లెక్స్ నూతన కార్యవర్గం

కావలి డివిజన్ స్కూలు కాంప్లెక్సుకు కొత్త అధ్యక్షుడుగా శ్రీ పి.ఎస్. సూర్యప్రకాశ రావు, కార్యదర్శిగా శ్రీ బి నాగేశ్వర రావు, కోశాధికారిగా శ్రీ పి. శ్రీనివాస రావు ఎంపికైనారు.

డివిజన్ ఉప విద్యాశాఖాధికారి శ్రీ సముద్రాల శ్రీహరిరావు బదలీ సందర్భంగా కాంప్లెక్స్ తరపున ఒక సభ జరిపి, సత్కరించారు . కొత్త అధికారి శ్రీ పి. శ్యామల రావు అధ్యక్షించారు.

## బహిరంగవేలము

కాలపరిమితి గడిచినప్పటికి గడిపించని పద్దులు

1) జి. నర్సింగ్ లాల్ శర్మ - పాన్ బ్రోకర్సు. పి.బి.యల్. నెం. 145 8/201 బజారు వీధి, తిరుపతి వారి తాలూకు కాలపరిమితి గడిచినప్పటికి 16.3.91 నుండి 25.5.91 తేది వరకు గల విడిపించని పద్దులు 5.8.92 తేది వుదయం 10 గంటల నుండి 8/201బజారువీధి, తిరుపతిలో బహిరంగముగా వేలము జరుపబడును.

2) యం. గోవింద లాల్ శర్మ పాన్ బ్రోకర్సు పి.బి.యల్. నెం. 218 20.2.708 కొర్లగుంట వారి తాలూకు కాలపరిమితి గడిచినప్పటికి 4.3.91 నుండి 16.5.91 తేది వరకు గల విడిపించని పద్దులు 5.8.92 తేది మధ్యాహ్నం 2 గంటల నుండి 20.2.708 కొర్లగుంట తిరుపతిలో బహిరంగముగా వేలము జరుపబడును.

3) శాంతి అండ్ కో పాన్ బ్రోకర్స్. పి.బి.యల్. నెం. 75 8/15 బజారువీధి, తిరుపతి వారి తాలూకు కాలపరిమితి గడిచినప్పటికి 4.12.90 నుండి 30.4.91 తేది వరకు గలవిడిపించని పద్దులు 6.8.92 తేది వుదయం 10 గంటల నుండి 8/15 బజారు వీధిలో బహిరంగముగా వేలము జరుపబడును.

4) సురేష్ పాన్ బ్రోకర్స్ పి.బి.యల్. నెం. 230 20.2.679 కొర్లగుంట వారి తాలూకు కాలపరిమితి గడిచినప్పటికి 4.12.90 నుండి 29.5.91 తేది వరకు గల విడిపించని పద్దులు 6.8.92 తేది మధ్యాహ్నం 2 గంటల నుండి 20.2.679 కొర్లగుంట, తిరుపతిలో బహిరంగముగా వేలము జరుపబడును.

5) జి.పి. శనకరాజ్ పాన్ బ్రోకర్సు. పి.బి.యల్. నెం. 26 8/2 బజారు వీధి, తిరుపతి వారి తాలూకు కాలపరిమితి గడిచినప్పటికి 1.4.91 నుండి 29.6.91 తేది వరకు గల విడిపించని పద్దులు. 10.8.92 తేది వుదయం 10 గంటల నుండి 8/2 బజారువీధి, తిరుపతిలో బహిరంగముగా వేలము జరుపబడును.

6) పూసాలాల్ ఓం ప్రకాశ్ శర్మ పాన్ బ్రోకర్స్. పి.బి.యల్. నెం. 159 779గిరిపురం తిరుపతి వారి తాలూకు కాలపరిమితి గడిచినప్పటికి 17.9.90 నుండి 2.4.91 తేది వరకు గల విడిపించని పద్దులు 17.8.92 తేది వుదయం 10 గంటల నుండి 779 గిరిపురం తిరుపతిలో బహిరంగముగా వేలము జరుపబడును.

7) జి. దోకల్‌రామ్ పటేల్ పాన్ బ్రోకర్స్ పి.బి.యల్. 173 13.1.22పెద్దకాపువీధి తిరుపతి వారి తాలుకు కాలపరిమితి గడిచినప్పటికి 1.6.91 నుండి 30.7.91 తేది వరకు గల విడిపించని పద్దులు 20.8.92 తేది వుదయం 10 గంటల నుండి 13.1.22 ఎ పెద్దకాపు వీధి, తిరుపతిలో బహిరంగముగా వేలము జరుపబడును.

8) గౌతమ్ చంద్‌మాణిక్ చంద్ జైన్ పాన్ బ్రోకర్సు పి.బి.యల్. 135 1-102-1పోస్టాఫీసు వీధి, రేణిగుంట వారి తాలూకు కాలపరిమితి గడిచినప్పటికి 2.1.91 నుండి17.6.91 తేది వరకు గల విడిపించని పద్దులు 21.8.92 తేది వుదయం 10 గంటల నుండి 1-102-1 పోస్టాఫీసు వీధి, రేణిగుంటలో బహిరంగముగా వేలము జరుపబడును.

9) పి. మాణిక్ చంద్ జైన్ పాన్ బ్రోకర్స్ పి.బి.యల్. నెం. 190 1-102-1పోస్టాఫీసు వీధి, రేణిగుంట వారి తాలూకు కాలపరిమితి గడిచినప్పటికి 9.6.90 నుండి 27.7.91 తేది వరకు గల విడిపించని పద్దులు 21.8.92 తేది మధ్యాహ్నం 2 గంటల నుండి 1-102-1 పోస్టాఫీసు వీధి, రేణిగుంటలో బహిరంగముగా వేలము జరుపబడును.

కె.వి. రామకృష్ణరావు
ప్రభుత్వము నియమించిన వేలము దారు
11/268, సంతపేట, నెల్లూరు.

### తడ కలూరు ఇసక కట్టడం

దగదర్తి మండలం తడకలూరు గ్రామంలో, ప్రాథమిక పాఠశాల భవన నిర్మాణం పరమ నాసికరంగా వుందని గ్రామస్తులు ఫిర్యాదు చేస్తున్నారు. ఇసుకలో పైపైన సిమెంట్ చల్లి కట్టేస్తున్నారట. సిమెంట్ బంగదారిన మార్కెటుకు తరలి పోతున్నదట. ఈ ఇసుక కట్టడం క్రింద పిల్లలను కూర్చో బెడితే ఎప్పుడో ఒకసారి కూలడం ఖాయమన్నది వారి భయం. రోజ్‌గార్ నిధుల దుర్వినియోగం గురించి కూడా చెప్తున్నారు వీరు.

సంబంధిత ఇంజనీర్లు ఆ భవనాన్ని సందర్శించి, లోపాలుంటే తక్షణం సవరించండి!

### ప్రజానాట్య మండలి శిక్షణా కార్యక్రమం

జానపద కళా రూపాలలో పల్లె ప్రజలకు శిక్షణ ఇవ్వడానికి ఆంధ్ర ప్రజానాట్య మండలి ఒక శిక్షణా కార్యక్రమం నిర్వహిస్తున్నది. ఆగస్టు 4,5 తేదులలో కోవూరు, గండవరం; 7,8,9 తేదులలో నెల్లూరు టౌన్ గాంధీ నగర్; 10,11,12 తేదులలో వడ్డిపాళెం; 14,15 తేదులలో గూడూరు; 16 తేది సూళ్లూరుపేటలో శిక్షణనిస్తారు. పాటలు, పల్లె సుద్దులు, వీధి నాటికలలో శిక్షణనిస్తారు. ఈ కార్యక్రమానికి కళాభిరుచి గల వారందరూ సహకరించాలని శ్రీ ఉన్నం బసవయ్య కోరుతున్నారు.

### బోగోలు దీనాలాపన

బోగోలు మండల గ్రామాలు ప్రకృతి నిరాదరణకు, నాయకుల నిర్లక్ష్యానికి గురై అణగారి పోతున్నాయని జువ్వలదిన్నె సర్పంచ్ శ్రీ ఎం. వెంకట సుబ్రహ్మణ్యం దీనాలాపన చేస్తున్నారు.

బోగోలు మండలంలో జిఎన్‌టి రోడ్డుకు తూర్పు గ్రామాలు తీరప్రాంతంలో వుండి తుఫాన్ల తాకిడికి అల్లాడి పోతుంటాయి; పడమర గ్రామాలు అనావృష్టితో అలమటిస్తుంటాయి. ఇంతకు ముందు ఈ గ్రామాలన్నింటికీ బిట్రగుంట లోకో షెడ్డు జీవనాధారంగా వుండేది. వ్యవసాయ కూలీలకు చేతినిండా పని దొరికేది. ఇప్పుడు వారందరూ ఉపాధి కోల్పోయారు. అందరూ సేద్యంపైనే ఆధారపడాలి. కాని, అది సక్రమంగా లేదు. జువ్వల దిన్నె, ఎన్‌వి పాళెం, సిఆర్ పాళెం గ్రామాలలో కేవలం రెండు వేల ఎకరాలకు మాత్రమే నీటి పారుదల వుంది. అల్లిమడుగు , ముంగమూరులలో కొద్ది ప్రాంతానికి కనిగిరి రిజర్వాయర్ నీళ్లు వస్తాయి. కొన పారుదల కావడంతో ఆ పారుదల దైవాధీనం. అధిక గ్రామాలలో మెట్ట పైర్లే సాగు చేస్తున్నారు. వాన పడితే అవి బ్రతుకుతాయి; లేకుంటే ఎండిపోతాయి.

సంవత్సరాలు గడిచే కొద్దీ తమ గ్రామాలు ఆర్థిక పరంగా చితికిపోతున్నాయన్నది శ్రీ సుబ్రహ్మణ్యం ఆవేదన. కనిగిరి రిజర్వాయర్ నుంచి చెరువులకు నీళ్లు తెచ్చే ఏర్పాటు చేయడం, బిట్రగుంట లోకోషెడ్డు వసతులు పాడుబడి పోకముందే అక్కడేదైనా పరిశ్రమ స్థాపింప జేయడం జరగాలని ఎమ్మెల్యే విష్ణువర్ధన రెడ్డిని కోరుతున్నారు.

విష్ణువర్ధన రెడ్డి రాజకీయ కల్మషం పూర్తిగా అంటని ఉత్సాహవంతుడైన యువకుడు! ఆయనకు పరిస్థితి అర్థమయ్యేటట్లు వివరించి, పురమాయించ గల్గితే నీటి పారుదల వసతి సాధించడం పెద్ద కష్టం కాబోదు. పెన్న డెల్టా ఆధునీకరణలోనో లేక తెలుగుగంగ పథకం నీళ్ల వాటాలోనో దీనిని చేర్పించ గల్గితే త్వరగా పనిముగుస్తుంది.

### రొయ్యలు

(5 పేజీ కొరవ)

అనునిత్యం వ్యక్తిగత

పూడిపర్తి ఫలితంతో చాలామంది రైతులు ఉత్సాహంగా ఈ రంగంలో ప్రవేశిస్తున్నారు. ఇందులో లాభాలు ఎట్లావున్నాయో, నష్టాలూ వాటి ప్రక్కనే పొంచి వుంటాయి. రైతులు తెలిసీ తెలియని తనంతో పొరపాటు పడకుండా, నిపుణులైన అనుభవం కల్గిన వారితో సంప్రదించి ఏదైనా మొదలు పెట్టడం మేలు.

ఎమాదముంది. చాలా కొద్ది కాలంలోనే ఈ వాస్తవాన్ని గ్రహించిన

## రైళ్ళ రాకపోకలు

నెల్లూరు రైల్వే స్టేషనుకు జూలై 1 నుండి వివిధ రైళ్ళ రాకపోకల వేళల వివరం

| బండిపేరు | మద్రాసు వైపు | విజయవాడ వైపు |
|---|---|---|
| చార్మినార్ ఎక్స్‌ప్రెస్ | ఉ.గం. 5.27 ని | రా. గం. 9.14 ని |
| జమ్ముతావి ఎక్స్‌ప్రెస్ | ఉ.గం. 8.47 | సా.గం. 5.10 |
| | (సోమవారం తప్ప) | (బుధవారం తప్ప) |
| పినాకిని ఎక్స్‌ప్రెస్ | ఉ.గ. 9.35 | సా5.02 |
| హౌరా–తిరుపతి | ప. 12.15 | ప. 12.52 |
| నవజీవన్ ఎక్స్‌ప్రెస్ | మ. 2.00 | ప. 1.12 |
| | (మంగళ, బుధ, శని, ఆది) | (సోమ, బుధ, గురు, ఆది) |
| కృష్ణాఎక్స్‌ప్రెస్ | సా. 5.40 | ఉ. 8.16 |
| వారణాశి –తిరుపతి | సా. 7.30 | ఉ. 9.11 |
| గోరఖ్‌పూర్–కొచ్చిన్ | రా. 9.28 | రా. 2.31 |
| | (మంగళ, శని) | |
| హైదరాబాద్ –కొచ్చిన్ | రా. 9.28 | రా. 2.31 |
| | (సోమ, శుక్ర) | (సోమ, మంగళ) |
| హౌరా మెయిల్ | రా. 1.34 | రా. 1.32 |
| సర్కార్ ఎక్స్‌ప్రెస్ | రా. 2.50 | రా. 10.46 |
| హైదరాబాద్ ఎక్స్‌ప్రెస్ | రా. 2.15 | రా. 7.11 |
| నారాయణాద్రి ఎక్స్‌ప్రెస్ | రా. 3.06 | రా. 9.33 |
| తిరుమల ఎక్స్‌ప్రెస్ | రా. 3.27 | రా. 9.57 |
| బొకారో ఎక్స్‌ప్రెస్ | రా. 12.25 | రా. 12.32 |
| జి.టి. ఎక్స్‌ప్రెస్ | రా. 3.27 | రా. 1.08 |
| ఒంగోలు–తిరుపతి ప్యాసింజర్ | ఉ. 8.11 | సా. 6.40 |
| కాకినాడ – తిరుపతి ప్యాసింజర్ | రా. 11.15 | సా. 6.30 |

పర్యవేక్షణలో నడవాల్సిన పెంపకం ఇది. ఎందరు సాంకేతిక నిపుణులను పెట్టినా - రైతుకున్నంత శ్రద్ధ రానేరాదు. ఏమాత్రం అజాగ్రత్తగావున్నా, ప్రాణమున్న జీవాలు కావడంతోమొత్తం నష్టపోయే (

కొన్ని పెద్ద పారిశ్రామిక సంస్థలు .పెంపకం వరకు ఉత్సాహమున్న రైతుల కప్పజెప్పి, మేత, ఎగుమతులు వంటివి తాము నిర్వహించాలన్న ప్రతిపాదనలు పరిశీలిస్తున్నాయి.



Edited, Printed and Published by N. Dolendra Prasad at Zamin Ryot Press, Nellore OFFSET printing at Nayagara E.